

Chandamama, September '49

Photo by R. Krishnan

స్నానాలు

అపూర్వ కల్పనా శిల్పంతో
హాస్యరస భరితమైన
అసమాన జానపద చిత్రం..




డైరెక్టర్... కె. వి. రెడ్డి. బి.యస్‌సి (ఆనర్సు)

# చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, చిక్కు చదరం, చిక్కు-బొమ్మలు, ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.


**చందమామ ఆఫీసు**

పోస్టుబాక్సు నెంబరు . 1686

మద్రాసు . 1.



JUPITER PICTURES CIRCUIT

## 'చందమామ' కు

## ఏజంట్లు కావాలి

●

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిన మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు మాకు వ్రాయండి.

**చందమామ ఆఫీసు,**

పోస్టుబాక్సు నెం. 1686, మద్రాసు - 1.



## పిల్లలకు ఒక కథ

# వెంబడిపడుట-పట్టుకొనుట

అమ్మ నీళ్లు పోసుకొనుటకు పిలిచినప్పుడు నేను ఎప్పుడు పారిపోతూ ఉండేవాణ్ణి లేక తప్పించుకునే విధము లేకపోతే తిన్నగా నీళ్లు పోసుకోకుండా ఉండడానికి గట్టిగా ప్రయత్నించేవాణ్ణి. ఎందువల్ల నంటే నీళ్లు అంటే నాకు అసహ్యంగా ఉండేది. కాని నాకు హమాం సబ్బు యిచ్చినందువల్ల నీళ్లు పోసుకోవడం అంటే నాకు మంచి సరదాగా ఉంది. హమాం సబ్బు పెద్ద బిళ్లతో నీవు చక్కని బుడగలు తేగలవు. దానికి మంచి వాసనగూడా ఉంది. అందువల్ల అమ్మ ఎప్పుడు నీళ్లు పోసుకోటానికి రమ్మన్నా నేను వెళ్లుతాను. కొంచంకూడా సందేహించను.






భారతదేశ జనులు మక్కువతో వాడే సబ్బు

**ది తాతా ఆయిల్ మిల్స్ కంపెని లిమిటెడ్**

వారిచే తయారుచేయబడినది

# అట్టమీది బొమ్మ

గోకుల ప్రజలు బృందావనం చేరుకొన్నప్పటినించీ సుఖంగానే ఉంటున్నారని అనుకొన్నాము. కాని, స్థలం మారినప్పటికీ మన చిన్నారి కృష్ణునికి మాత్రం గండాలు తప్పనేలేదు.

ఒకనాడు ఏమి జరిగిందంటే—శ్రీ కృష్ణుడు, అతని అన్న బలరాముడు, పసులకాపరులు, అందరూ కలిసి ఆవులను అడవులకు తోలుకొనిపోయారు. ఆ రోజున ఎండ మండిపోతూవుంది. తాము దాహం తీర్చుకొని, ఆవులకు నీళ్లు పెట్టుకు రావచ్చుకదా అని చెప్పి, వాళ్లు దూరాన ఉండే చెరువుకి పోయారు.

ఆ చెరువుదగ్గర బకాసురుడనే రాక్షసుడు కొంగరూపంలో ధ్యానంచేస్తూ కూర్చునివున్నాడు. వీళ్ళందరూ కంటబడేవరకు, దొంగధ్యానంలో వున్న బకాసురుడు పొడవుపాటి ముక్కులు విచ్చుకొని, హాంమ్మంటూ వచ్చి చిన్నారి కృష్ణుణ్ణి ఒక్క గుటకలో కబళించివేశాడు. బలరాముడూ తక్కినవాళ్లూ ఈ దృశ్యం చూడలేక మూర్ఛపోయారు.

అప్పుడు అవతార పురుషుడైన శ్రీ కృష్ణుడు తన తేజస్సు నంతటినీ ప్రళయాగ్నిగా మార్చివేశాడు. ఆ తాపం భరించలేక బకాసురుడికి గొంతుకాలి, ఉక్కిరి బిక్కిరి అయి, తను మింగిన కృష్ణుణ్ణి 'ఓక్' మంటూ డోకివేశాడు. ఇవతలపడిన కృష్ణుణ్ణి తన ఇనుపముక్కులతో పొడిచి చంపుదామని బకాసురుడు ప్రయత్నించేటంతలో, చిన్నారి కృష్ణుడు మందహాసంతో బకాసురుని రెండు ముక్కులూ తన రెండు చేతులతోనూ పట్టి, తాటిమట్ట చీల్చినట్టు నిలువునా చీల్చివేసేవరకు, ఆ మాయకొంగ రెండు పాయలై, చచ్చి నేలని కూలింది. ఈ విధంగా కృష్ణునిచేతిలో మరొక దుష్ట రాక్షస సంహారం జరిగింది.




సంపుటి 5
సంచిక 3

సంచాలకుడు: చక్రపాణి

సెప్టెంబరు
1949

# విఘ్నేశ్వర ప్రార్థన

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.

తుండము నేకదంతమును తోరపుబొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయుగజ్జెలును మెల్లనిచూపుల మందహాసమున్
కొండొక గుజ్జురూపమున కోరినవిద్యలకెల్ల నొజ్జయై
యుండెడు పార్వతీ తనయ ఓయి గణాధిప నీకు మ్రొక్కెదన్.







# బొండ్లాం

పోకిరి మూకల జట్టొకటి
బొండ్లాం పెండ్లికి వచ్చింది;
ఆకస మంతటి పందిట్లో
అమ్మలక్కలును చేరారు ;
భూదేవంతటి యరుగులపై
బొజ్జల గాంగీ కూర్చుంది;
తములపాకు దడి చుట్టారూ
దాసీముండలు నిలిచారు.
కూర్చిన ముత్యాల్ హారాలూ
కొండఱు కూరుస్తున్నారు;
కూర్చని ముత్యాల్ తలబ్రాలూ
కొండఱు కలబోస్తున్నారు.
సన్నాయీ నొక్కులతో పీ
ర్సాహెబు మేళము సాగింది;
అప్పయ శాస్త్రుల మంత్రాలూ
కప్పల బెకబెక లట్టున్నై.
సుముహూర్తము దాసిందంటూ
సూత్రం గట్టన్నాడతడు.

రచన :

# పెండ్లి

బొండ్లం సూత్రం పట్టాడు,
పెండ్లికొమార్తె తలెత్తింది.
పిల్లతరపువా డొక డీలా
పేచీపెడుతూ, "పిల్లోడా!
వరిగపొట్టుతో మోకేస్తా
వా? సూత్రము గట్టాల" నియెన్.
పెండ్లికుమారున కొళ్లంతా
ముండ్లు గ్రుచ్చిన ట్లుందపుడు.
పొట్టిముంత యొక డిదివింటూ,
బొండ్లవైపున గూర్చుండి,
"జల్లెడతో మీయమ్మాయి
నీళ్లు దీసుకొచ్చిందంటే
నిముసములో వేయిస్తాము
విగ్గుదేలిపిస్తా" మనియెన్.
పెండ్లికొమార్తెకు సిగ్గేసి
పెద్ద తడవు తల వంచింది.
పక్కలు నొప్పులు పుట్టేలా
పందిరి పకపక లాడింది.
పరియాచకములతో పెండ్లి
బ్రహ్మాండంగా జరిగింది.

"ఏటుకూరి"





# మృత్యుదేవత

ఒక పల్లెలో ముగ్గురు దొంగ లుండేవారు. దగ్గరగా ఉన్న ఒక కొండలోయలో వాళ్లు దాగుకొని, ఆ దారే పోయే బాటసారులపైన పడి రోజూ దోచుకుంటూవుండేవాళ్లు. ఒక నాడు వాళ్లా లోయలో పొంచి ఉండగా కొండనుంచి పరుగెత్తుకొస్తూ ఒక సన్యాసి కనపడ్డాడు. వాళ్లా సన్యాసిని ఏ పెద్దపులో తరుముకొస్తోందనుకున్నారు. తాము దాగుకొని ఉన్న పొదలోంచి బయటకొచ్చి, సన్యాసిని అడ్డగించి "ఎందుకయ్యా ఇలా పారిపోతున్నావ్?" అని అడిగారు.

అప్పుడా సన్యాసి గజగజ వణుకుతూ, "ఆ కొండలో ఒక గుహ ఉంది. తపస్సు చేసుకోటానికి వీలుగా ఉంటుందని ఆ గుహలోకి వెడితే నాకు మృత్యుదేవత కనిపించింది. ఇంక ఒకక్షణం నిలబడినా అది నన్ను చంపేస్తుందని భయమేసి పారిపోతున్నాను, నన్ను ఆపకండి" అన్నాడు.

ఆ మాటలు విని వాళ్లు ఆశ్చర్యపడి, "ఏమిటీ, మృత్యుదేవతా? ఇంతకాలము నించి దొంగతనాలు చేస్తున్నాము. దోచుకొంటున్నాము. ఈ కొండపక్కనే ఎంతో మంది బాటసారుల బుర్రలు పగులగొట్టి వాళ్ళ డబ్బూ దస్కం లాక్కొంటూ వున్నాము. మా కెప్పుడూ కనపడలేదే ఆ మృత్యుదేవత? ఏదీ, ఎక్కడుందో వచ్చి చూపించు" అన్నారు.

ఆయన రానంటెవినక, వాళ్లు ఆయన్ని బలవంతపెట్టారు. ఇక తప్పదనుకుని సన్యాసి, వాళ్లని గుహలోకి తీసుకువెళ్ళాడు.

వాళ్లు గుహలో కొంతదూరం వెళ్లేటప్పటికి ఎదురుగుండా పెద్ద ధనరాసి ఒకటి కనపడింది. అందులో ఉన్న బంగారం, వెండీ ధగధగ మెరిసిపోతూ కళ్లు మిరుమిట్లు కొలిపినయి. వాటి కాంతికి గుహలో చీకటి లేకుండా పోయి,

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మద్రాసు



గ్యాసులైటు పెట్టినట్లుంది. దొంగలు ముగ్గురూ ఆ రాసి చూస్తూ నిలబడిపోయి తమకళ్లను తామే నమ్మలేక పోయారు! 'ఇక్కడ మన కళ్ళకు కనిపిస్తున్న ధన రాసి నిజమయినదేనా? మాయ కాదుకద! మనం కలకనటం లేదుకద!—మన జీవితంలో ఎన్నడైనా ఇంతపెద్ద ధనరాసి ఒక్కచోట పోగుపడివుండటం చూచి ఎరుగుదుమా! ఆహా, ఎంత అదృష్టం! భాగ్యమంటే నిజంగా మనదే భాగ్యం!'— అని వాళ్లు అలా నిలబడిపోయి చూస్తుంటే సన్యాసి "అన్నలారా, చూశారుకదా ఈ ధనరాసిని? ఇదే మనుష్యుల పాలిటి మృత్యుదేవత! ఇంక ఇక్కడ ఒక్క నిమిషమైన ఆగకండి. చంపేస్తుంది. నేను పోతున్నాను. మీరు కూడా పారిపొండి" అని చెప్పి అక్కడ నిలబడక తుర్రుమన్నాడు.

"ఏది కావలస్తే అది ఇచ్చే యీ ధన లక్ష్మిని 'మృత్యుదేవత' అంటాడేమిటి సన్యాసి?" అని వాళ్లు ఆశ్చర్యపోయారు. "వాడి మాటకేంలే, పిచ్చివాడు!" అనుకుంటూ ఆ సొమ్మును పంచుకుందామని వాళ్లు లెక్కపెట్టడం మొదలెట్టేరు. లెక్క పెట్టడానికి వందా, వెయ్యానా? లక్షలూ, కోట్లూ, అర్బుదాలూ ఉన్నాయి ఆరాసిలో! ఎంతసేపు లెక్కపెట్టినా తరగలేదారాసి. వాళ్లకి చేతులు నొప్పిపుట్టాయి. ఆయాసం వచ్చింది. ఆకలి వేసింది. అప్పుడు వాళ్లలో ఒకడు, "నేను పల్లెలోకి వెళ్లి భోజనం చేసి, మీకు భోజనం తెస్తాను. నే వచ్చే దాకా మీరిద్దరూ యీ రాసిని కాపలా కాస్తుండండి. తర్వాత ముగ్గురం పంచు కుందాం" అన్నాడు. ఆ మిగతా ఇద్దరూ 'సరే' అని వాణ్ణి పల్లెకు పంపారు.

పల్లెకు పోతూ దారిలో వాడు ఇలా అనుకున్నాడు: "వీళ్లిద్దరూ ఎంత మూర్ఖులు. తమకి నిజంగా నేను అన్నం



మోసుకురావటానికే వెడుతున్నాననుకున్నారు! అంతేకాని ఈ ధనమంతా నేనొక్కణ్ణే దక్కించుకోటానికో మాంచి ఉపాయం ఆలోచించుకుని వెడుతున్నానని యీ తెలివితక్కువ నాగమ్మలకి తెలీదు! తెలివి లేకున్నా డబ్బులో వంతు మాత్రం కావాలట! మూడు వంతులు వేస్తారట! నా కొక్క వంతుట! చూద్దాం! ఒక్క నాణెమైనా వీళ్ళకి దక్కనివ్వక అంతా నేనే పుచ్చుకుంటాను." అని అనుకుని, తన ప్రయత్నం సఫలమై ఆ సొమ్మంతా తనకు చిక్కాక దానితో తానేమేమి చేయాలో ఆలోచించుకుంటూ పల్లెకు పోయాడు.

వాడు గుహ వదలివెళ్ళినతర్వాత మిగత ఇద్దరిలో ఒకడు రెండోవాడితో, "ఒరే అబ్బీ, చూశావా వీడి తెలివి? తను తిరిగి వచ్చే దాకా మనం కాపలా కాయాలట! తాను వచ్చి మనతో ఈ సొమ్ము పంచుకొంటాడట! మంది ఎక్కువైతే మజ్జిగ పల్చబడిపోతుందన్న సంగతి నీకు తెలిసిందే కదా? మనం వీడికి వాటా ఇవ్వకూడదు" అన్నాడు.

ఆమాటవిని రెండోవాడు, "ఇవ్వకూడదనే నేనూ అనుకుంటున్నాను. కాని వీణ్ణి వదిలించుకోడం ఎలాగ?" అని అడిగేడు.

"దానికేముంది? వాడు తిరిగి వచ్చేవేళకి మనమిద్దరం గుహ ద్వారంవగ్గర దాక్కుని ఉండి, వాడు లోపల అడుగుపెట్టడం తడువుగా మన దుడ్డుకఱ్ఱలతో మోది చంపేస్తే సరి శని విరగడైపోతుంది" అని సలహా చెప్పాడు. అందుకు రెండోవాడు ఒప్పుకున్నాడు. వాళ్ళిద్దరూ తమ బడితెలతో గుహ ద్వారందగ్గర కాచుకుకూచున్నారు.

కొంతసేపటికి, పల్లెకు వెళ్ళినవాడు భోజన పదార్థాలతో తిరిగి వచ్చాడు. వాడు గుహలో అడుగుపెట్టీ పెట్టడంతోనే అక్కడ పొంచిఉన్న మిగతా ఇద్దరూ తమ దుడ్డు

కఱ్ఱలతో వాడి తల పగలగొట్టి చంపేశారు. ఇలాగ వాడా ధనరాశికి బలి అయాక వాళ్ళిద్దరూ, తమ వంటిమీద పడ్డ రక్తాన్ని కడుక్కుని, వాడు తెచ్చిన భక్ష్యాలను గుహలోకి తీసుకుపోయి, ఆ ధనరాసికేసి చూస్తో, 'ఈ డబ్బంతా మనదేకదా' అని లొటలు వేసుకొంటూ, ఆ భక్ష్యాలు తిన్నారు.

తిని ఇన్నినీళ్లు తాగేరు. వెంటనే వాళ్లకి వికారం వచ్చి, కడుపులో చెయ్యి పెట్టి కలిపినట్లుగా బాధ పెట్టింది. మరి కాస్సేపటికి ఆ బాధ ఎక్కువై. తాము తిన్న అన్నంలో విషం ఉందన్న సంగతి వాళ్లకి బోధపడింది. అప్పుడు వాళ్ళలో ఒకడు రెండోవాడితో, "చూశావ్రా అబ్బీ, ఈ దుర్మార్గుడు ఎంత ద్రోహం చేశాడో? మన కిద్దరికీ ఇలాగ విషం పెట్టి చంపేసి, ఈ డబ్బంతా తనే దక్కించుకుందాం అనుకున్నాడు" అని తిట్టడం మొదలెట్టేడు.

రెండోవాడు, "ఒరేయ్, వాణ్ణి అనటం ఎందుకు? మనమేం తక్కువచేశాం? లింగాన్ని మింగేవా డొకడైతే, గుడిని మింగేవా డొకడన్నట్లు, మనం వాడికంటే ఎక్కువ ద్రోహాన్నే చేశాం! ఇంతవరకూ అన్నదమ్ములలాగ కలసిమెలసి తిరిగిన మనకి, ఈ రోజున ఈ ధనరాసి కనపడి, మనలో దుర్బుద్ధి పుట్టించి ఒకళ్ళచేత ఒకళ్లని నాశనం చేయించింది. ఆ సన్యాసి దీన్ని మృత్యుదేవతని చెప్పి పారిపోతే మనం ఆయన్ని పిచ్చివాడని గేలిచేశాం! ఆయన చెప్పిన దెంత నిజమో చూడు!" అన్నాడు.

చేతులు కాలేక ఆకులు పట్టుకుంటే ఏం లాభం? మరి కాస్సేపటికే ఆ విషంవల్ల బాధ ఎక్కువైపోయి, ఇద్దరూ ఆ ధనరాసిముందర గిలగిల తన్నుకు చచ్చిపోయారు.






చక్కగా అలంకరించుకొని వచ్చి తన ఎదట నిలబడిన బాలనాగమ్మను చూడగానే మాయలఫకీరుకు మరింత నిషా ఎక్కిపోయింది.

"ఏం, బాలనాగూ, ఉన్నట్టుండి ఇట్లా మారిపోయినావు?" అన్నాడు.

"నా పన్నెండేండ్ల వ్రతం అయిపోవచ్చింది," అన్నది బాలనాగమ్మ.

ఆమాట వినగానే మాయలఫకీరు చెంగున ఒక్క దూకుదూకి బాలనాగమ్మను కావిలించుకోబోయాడు.

"అగు, ఫకీరూ, అగు! నన్నంటితే తల పగిలి నిష్కారణంగా చస్తావు. నా వ్రతం ఇంకా తొమ్మిది రోజులున్నది. ఈ తొమ్మిది రోజులూ ఓపికపట్టితివా ఆ తరవాత నీ కడ్డులేదు," అన్నది బాలనాగమ్మ.

"ఆ తరవాత నా దానివైపోతావా?" అన్నాడు ఫకీరు.

"అయిపోతాను. కాని, ఒక్కటి చెబితే నేను సంతోషంతో నీదాన్నవుతాను" అన్నది బాలనాగమ్మ.

"ఏమిటది? నీ కోరిక కడ్డేమిటి?" అన్నాడు ఫకీరు.

"నీ ప్రాణం ఎక్కడున్నదీ చెప్పాలి. నిన్నెవరన్నా చంపేస్తే అ తరవాత నాకు దిక్కెవరు?" అన్నది బాలనాగమ్మ.

ఫకీరు బిగ్గిరిగా నవ్వి, "ఓసి పిచ్చిదానా! నా ప్రాణం ఎవరికీ అందేది కాదు. దాన్ని నువు రక్షించనక్కర్లేదు. నేనే రక్షించుకుంటాను," అన్నాడు.

బాలనాగమ్మ చిన్నబుచ్చుకుని, "ఎవరికీ నీ ప్రాణం అందదంటే ఎట్లా



"సప్తసముద్రాల అవతల జీవిగడ్డ. జీవిగడ్డలో రాతిగోడల మధ్య రాతికోట. రాతికోట నడుమ ఉక్కుకోట. ఉక్కుకోటలో అయిదు వందల వెలగచెట్లు, మూడువందల మునగచెట్లు, తొమ్మిది వందల తాడిచెట్లు, అయిదువందల వేప చెట్లు. వీటన్నిటి మధ్యా ముంతమామిడి చెట్టు. ముంతమామిడి చెట్టు తొర్రలో ఏడు దొంతర్లు. అన్నిటికన్నా అడుగు దొంతర్లో బంగారు పంజరం. పంజరంలో పంచవన్నెల చిలుక. చిలుక కంఠంలో నా ప్రాణం ఉంది. ఆ చిలుక చస్తేనే గాని నేను చావను," అని చెప్పాడు మాయల ఫకీరు.

బాలనాగమ్మ ముఖం పైకి విప్పారింది గాని లోపల ఆమెకున్న ఆశలన్నీ ఒక్క సారిగా అడుగంటాయి. తన కొడుకు, పసివాడు. ఇంకా మిగిలి ఉన్న ఎనిమిది రోజుల్లో సప్తసముద్రాలు దాటిపోయి, ఈ కోటలన్నీ దాటి ఆ చిలకను పట్టుకునే దేమిటి, ఫకీరు చచ్చేదేమిటి, తనను చెర విడిపించేదేమిటి?

అయినా ఫకీరు చెప్పినదంతా చీటీమీద వ్రాసి బాలనాగమ్మ తంబళ్ళపెద్ది ద్వారా

నమ్మటం? కనీసం అది ఎక్కడ ఉన్నదీ చెబితే నాకు ధైర్యంగా ఉంటుంది." అన్నది.

"నరమానవుడి కెవరికీ అందని చోట ఉన్నది. సరేనా?" అన్నాడు ఫకీరు.

"అంత భద్రంగా ఉంటే నాకు చెప్ప టానికేం?" అన్నది బాలనాగమ్మ కోపం వచ్చినట్టు నటిస్తూ.

బాలనాగమ్మకు సంతోషం కలిగించ టానికీ, తన ప్రాణం ఎంత భద్రంగా ఉందో ఆమెకు తెలియజెప్పటానికీ మాయలఫకీరు తన రహస్యం కాస్తా చెప్పేశాడు.

తన కొడుక్కు అందజేసింది. ఆ ఉత్తరం చూస్తూనే బాలవర్ధిరాజు తంబళ్ళపెద్దితో, "అవ్వా, మా నాన్నకు రావలసిన బాకీలు కొన్ని వసూలు చేసుకువస్తాను. పత్రాలు గడువు దాటిపోతున్నాయి. ప్రయాణాని కింత అన్నంకట్టు" అన్నాడు.

తంబళ్ళపెద్ది నిజమే ననుకుని బాలుడి కింత అన్నం మూట గట్టి ఇచ్చింది. అది తీసుకుని బాలుడు నడక సాగించి దొంతిరాజు పట్టణమూ, రక్తకొల్లూ గడిచి సముద్ర తీరానికి చేరుకున్నాడు. సముద్రం ఒడ్డున పన్నెండు కొమ్మల మర్రి చెట్టుకింద విశ్రాంతి తీసుకుని ఆలోచించసాగాడు.

"అప్పుడే తల్లి పెట్టిన గడువులో రెండు మూడు రోజులు గడిచాయి. ఒక పడవగాని, తెప్పగాని లేకుండా ఎట్లా సముద్రం దాటటం? గడువయిపోయినాక మాయల ఫకీరు ఒక్క క్షణం ఆగుతాడా? ఏం దారి? అని బాలుడు చింతించసాగాడు.





బాలుడీవిధంగా ఆలోచిస్తూ ఉండగా చెట్టుమీదనుంచి ఏదో పక్షుల అరుపులు ఆర్తనాదంలాగా వినిపించాయి. బాలుడు తల ఎత్తి చూచేసరికి ఒక పెద్ద నాగసర్పం చెట్టెక్కుతూ కనిపించింది. బాలుడు వెంటనే లేచి చంద్రాయుధం తీసి పాము శిరస్సుమీద ఒక్క దెబ్బ వేశాడు. ఆ దెబ్బకు పాము అతనిమీద దూకి అతన్ని కాటువేసి ప్రాణం విడిచింది. ఆ విషం బాలుడి శరీరంలోకి పోయి మైకం కమ్మింది. శరీరం కొయ్యబారిపోయింది. నోట నురుగులు కక్కుతూ బాలుడు కాస్తా ప్రాణాలు విడిచాడు.

ఎప్పుడైతే బాలవర్ధిరాజు ఇక్కడ ప్రాణాలు విడిచాడో అప్పుడే అక్కడ పానుగంటిపట్టణంలో అతను నాటిన నాగమల్లిచెట్టు మాడిపోయింది. అతను చచ్చిపోయినాడని తెలుసుకుని అతని ఆరుగురు తల్లులూ గోడుగోడున ఏడవసాగారు.

ఇది జరిగిన కొంతసేపటికి రెండు గండభేరుండపక్షులు ముక్కున ఏనుగును కరుచుకుని, సముద్రంమీదిగా మర్రిచెట్టు దగ్గిరికి ఎగురుతూ వచ్చాయి. బాలవర్ధిరాజు ఈ పక్షులపిల్లలనే పాము బారినుండి రక్షించి తన ప్రాణాలర్పించాడు,

ఈ గండభేరుండపక్షులు అదివరలో చాలాసార్లు బిడ్డలను కనటమూ, వాటిని నాగేంద్రుడు కబళించడమూ జరిగింది. ఈసారి పిల్లలు ప్రాణాలతో దక్కాయి. చెట్టుకింద చచ్చిపడిఉన్న పాము కనిపించింది. దానిని చంపిన కుర్రవాడు కూడా చచ్చిపడి ఉండటం అవి చూశాయి.

ఇది చూడగానే ఒకపక్షి ఎగురుకుంటూ సంజీవి పర్వతానికి వెళ్లి మర్నాడు తెల్లవారేసరికి ఒక సంజీవి పుల్లను తెచ్చింది. అది ముక్కున కరుచుకుని మూడుసార్లు బాలుడిచుట్టూ తిరిగేసరికి బాలుడు నిద్ర



లేచినట్టు లేచి కూర్చున్నాడు. మరుక్షణమే పానుగంటిపట్టణంలో నాగమల్లి చెట్టు చిగిర్చసాగింది.

బాలుడి తల్లుల ఆనందానికి మేరలేదు. వాళ్లారోజు దానాలూ, ధర్మాలూ, సంతర్పణలూ చేసుకున్నారు.

"నాయనా, మా పిల్లల ప్రాణాలు కాపాడావు. మేము నీకేమి ఉపకారం చెయ్యగలమో చెప్పు," అని గండభేరుండపక్షు బాలుణ్ణి అడిగాయి.

"నాకు జీవిగడ్డలో పని ఉంది? అన్నాడు బాలుడు.

"మేము నిత్యమూ అక్కడికి పోతూ ఉంటాము. మాతో రా!" అన్నాయి పక్షులు.

మగపక్షి ఒక తాటిదూలం తెచ్చి ముక్కుతో మధ్య డొల్లచేసింది. అందులో బాలుడు పడుకున్నాడు. రెండు పక్షులూ తాటిదూలం చెరొకవైపునా కరుచుకుని ఎగిరిపోసాగినై.

అవి అలా ఎగురుతూ, సప్తసముద్రాలూ దాటి, రాతిగోడ దాటి, రాతికోట దాటి, ఇనపకోట మధ్య అరణ్యంలో అతన్ని దించాయి.

ఆ అరణ్యం చాలా దట్టంగా ఉంది. బాలుడు తల్లి పేరు తలుచుకుని చంద్రాయుధంతో ఒక్కొక్క వేటుకు ఒక్కొక్క చెట్టు పడగొట్టుతూ ముంతమామిడిచెట్టు చేరుకున్నాడు. దానినికూడా ఒక్క వేటుతో పడగొట్టాడు. దొంతులూ కనిపించాయి.

ఇంతలో గండభేరుండపక్షులు, "అదేమిటి? ఆ చెట్టుజోలి కెందుకు పోతున్నావు? అందులో మాయల ఫకీరు ప్రాణం ఉంది, దానిజోలికి పోతే ఫకీరు నిన్ను చంపేస్తాడు," అని చెప్పాయి.

"ఫకీరే నన్ను తనప్రాణం తెమ్మన్నాడు. నేనాయన నౌకరును," అన్నాడు బాలుడు.



"ఎట్లా తెస్తావు? ప్రతి దొంతిలోనూ ఇనపకండిరీగ లున్నాయి. అవి కుడితే చచ్చిపోతావు," అని పక్షులు చెప్పాయి.

"వాటిని కత్తితో చంపేస్తాను" అన్నాడు బాలుడు.

"వాటి రక్తం చుక్క కింద పడితే వెయ్యేసి కండిరీగలు పుడతాయి. ఎట్లా చంపుతావు? చాల్లే. వెనక్కు పోదాం రా!" అని పక్షులు సలహా ఇచ్చాయి.

"నేనిక్కడ చచ్చి అయినా పోతాను గాని ఫకీరు ప్రాణం తేకుండా తిరిగి రాను, మీరు వెళ్లిపొండి," అని బాలుడు మొండి కేశాడు.

గండభేరుండ పక్షులు బాలుడి కోర్కె తీర్చటానికి ఒక మంచి ఉపాయం చేశాయి. పోతుపక్షి బాలుణ్ణి ఒక దట్టమైన పొదలో కూర్చోబెట్టి వచ్చింది. ముంత మామిడి చెట్టును మూడు తాపులు తన్నింది. ఆ దెబ్బకు దొంతులు పగిలి గండు తుమ్మెదలు రివ్వున లేచాయి. అప్పుడు పెంటిపక్షి బలంకొద్దీ తన రెక్కను విసిరింది. ఆ గాలి తాకిడికి గండు తుమ్మెదలు ఎన్నోమైళ్లు కొట్టుకు పోయాయి. పోతుపక్షి చెట్టు తొర్రలో ఉన్న పంజరం ముక్కున కరుచుకుని తీసుకుపోయి దాన్ని పొదలో ఉన్న బాలుడికిచ్చింది.

"అబ్బాయీ, ఫకీరువాడికి ఈపాటికి తెలిసిపోతుంటుంది. తన ప్రాణాన్ని రక్షించుకునేటందుకు వాడు ఇయిలుదేరి వస్తాడు. నీ ప్రాణమూ మా ప్రాణమూ కూడా దక్కదు. అందుచేత ఆ చిలకను ఇప్పుడే స్వాధీనపరుచుకో," అని గండభేరుండ పక్షులు బాలవర్ధిరాజుకు హెచ్చరిక చేశాయి.

బాలుడు పంజరంలోనుంచి చిలకను తీసి, తన చెవి పోసలు రెండూ దాని



కాళ్ళకు తొడిగి రెంటికీ కొక్కెం తగిలించాడు. దానితో మాయలఫకీరు కాళ్లు పడిపోయాయి.

"నా ప్రాణం ఎవడో అపహరించాడు. లేదా నా చిలక మేతకు పోయి ఏ లతలకో కాళ్లు ఇరికించుకున్నది," అనుకున్నాడు మాయలఫకీరు.

ఈలోపుగా ఈతబొండులో బాలవద్ది రాజును కూర్చోబెట్టి గండభేరుండపక్షులు ఇంటిదారి పట్టాయి. సముద్రాలన్నీ దాటి మర్రిచెట్టు చేరుకున్నాయి. పిల్లలకు మేత బెట్టి బాలుణ్ణి మళ్లీ తీసుకుపోవటానికి సిద్ధపడ్డాయి. కాని బాలుడు కాలినడకను తానే వెళ్లిపోతానని పక్షులదగ్గిర సెలవు పుచ్చుకున్నాడు.

నాలుగురోజులు నడిచి బాలవద్దిరాజు నాగళ్లపూడి గట్టు చేరి తంబళ్ళపెద్దు ఇంటికి వెళ్లాడు.

"బాకీలు వసూలు చేసుకు వచ్చావా" అని అడిగింది పెద్దు.

"బాకీవాళ్ళంతా పేరారి అయినారు. పత్రాలు చింపేశాను" అన్నాడు బాలుడు. అవ్వ లబోమని మొత్తుకున్నది.

"ఊరుకో, అవ్వా. రోజులు కలిసి వస్తే ఈ కోటలో సొత్తంతా మనదే అవుతుంది." అంటూ బాలుడు గాండ్లసంగు ఇంటికి పోయినాడు. గాండ్లసంగు నువ్వులు గానుగ ఆడుతున్నది. బాలుడు చిలకను చేత్తో పట్టుకుని ఎగిరి గానుగమీద ఎక్కి తిరగ సాగాడు. వెంటనే బయట తోటలో ఉన్న మాయలఫకీరుకూడా గుండ్రగా తిరగ సాగాడు. బాలుడు గానుగను ఇంకా వేగంగా తిప్పాడు, ఫకీరుకూడా ఇంకా వేగంగా తిరిగాడు.

బాలుడు చిలకను చేత బట్టుకుని ఫకీరుదగ్గిరికి పోయినాడు.



"అరే, నువు నా ప్రాణం తెచ్చావు. నాది నా కిచ్చెయ్యి," అన్నాడు ఫకీరు.

"కొంచెం ఆగరా, ఫకీరూ! బాలనాగమ్మ నీకేమవుతుంది?" అన్నాడు బాలుడు.

"అది నా పెళ్లాంరా," అన్నాడు ఫకీరు.

బాలుడికి పట్టరానంత కోపం వచ్చింది. చిలక కంఠం నొక్కాడు.

ఫకీరు లబలబలాడుతూ, "దాన్ని చంపకు. బాలనాగమ్మ నాకు తల్లి!" అన్నాడు.

"ఫకీరూ, నీదగ్గిర చాలా మంత్రాలూ, భూతాలూ ఉన్నాయిట. వాటిని కాస్త నాకుకూడా చెప్పు." అన్నాడు బాలుడు.

"నా రహస్యాలు నేనెవరికీ చెప్పను." అన్నాడు ఫకీరు.

"చెప్పకపోతే ఈ చిలకను చంపేస్తాను" అని బెదిరించాడు బాలుడు.

దేవుడా అంటూ ఫకీరు తన రహస్యాలన్నీ బాలవర్ధిరాజుకు చెప్పాడు. దుడ్డుకర్రా, గోటిచిప్పా, తన మంత్రపు బెత్తాబూ ఎట్లా ఉపయోగించాలో బాలుడికి నేర్పాడు. రాళ్లూ రప్పలూ అయిపోయి కోటచుట్టూ

ఉన్న బాలవద్దిరాజు తండ్రులనూ, వారి సైన్యాలనూ బతికించాడు. వారందరికీ తాను ఎరుకచెప్పమన్నాడు.

బాలనాగమ్మ చెర అయిపోయింది. ఆమెను బాలుడు పల్లకీలో కూర్చోబెట్టి ఒకపక్క గాండ్లసంగుసూ, ఇంకొకపక్క ఫకీరునూ మొయ్యమన్నాడు. చేసేదిలేక ఫకీరు పల్లకీ ఎత్తుకున్నాడు. అందరూ కలిసి తంబళ్ళపెద్దుతోసహా బయలుదేరారు.

నాగళ్లపూడిగట్టు దాటి, నయునవాది పట్నం దాటి వీరంగా చిలుకవాదిపట్నం చేరారు.

అక్కడ బాలుడు తాను బతికించిన రాజు కూతుర్ని తల్లిదండ్రుల అనుమతితో మహా వైభవంగా పెళ్లాడాడు. అక్కడి నుండి బయలుదేరి గంగవాదిపట్నం వచ్చి ఆ రాజుకూతుర్నికూడా పెళ్లాడాడు. ఆ తరవాత పులిరాజుపట్నం చేరి పులిరాజు కూతుర్నికూడా పెళ్లాడాడు. అక్కడినుండి బయలుదేరి అందరూ పానుగంటిపట్నం చేరుకున్నారు.

బాలుడికొరకు ఎదురుచూస్తున్న అరుగురు తల్లుల ఆనందానికి మేరేలేదు. ఫకీరువాతపడిన బాలనాగమ్మ తిరిగి రావటం కాకుండా చచ్చారనుకున్న



మొగుళ్లూ చుట్టాలూ తిరిగివచ్చారు. అరుగురు అక్కచెల్లెళ్లూ గాజులబత్తుడి చేత గాజులు తొడిగించుకున్నారు. వారి వైధవ్యం అయిపోయింది.

ఇంత ఆనందంలోనూ ఒక చిక్కు ఎదురయింది. బాలనాగమ్మ భర్త కార్యవద్ది రాజు, "ఇది ఇంతకాలం ఫకీరుదగ్గిర ఉన్నది. ఇది వ్రతం చెడలేదని ఎలా నమ్మటం? నేను బాలనాగమ్మను ఏలను" అన్నాడు.

అప్పుడు బాలవద్దిరాజు సలసల కాగే నూనెలో తన ఉంగరం వేసి తల్లిని తీయమన్నాడు. బాలనాగమ్మ తీసింది.

"ఫకీరుదగ్గిర ఇది ఎన్ని మాయలూ, పసర్లూ నేర్చిందో? నేను నమ్మను," అన్నాడు కార్యవద్దిరాజు.

బాలుడు పెద్ద అగ్నిగుండం తయారు చేయించాడు. బాలనాగమ్మ అందులోకి దూకింది. కట్టినకోక కాలలేదు, పెట్టిన కుంకం చెదరలేదు. బాలనాగమ్మ ఆ గుండంలో నాలుగు గడియలు నిలబడి పైకి వచ్చింది. ఆమె భర్త ఆనందానికి మేరలేదు.

బాలవద్దిరాజు ఏడుగురు తల్లులూ, తండ్రులూ మళ్లా వైభవంగా పెళ్లి చేసుకున్నారు. ఈ సంబరాలన్నీ అయిపోగానే బాలవద్దిరాజు మాయలఫకీరును వెంట బెట్టుకుని నాగళ్లపూడి గట్టుకు వెళ్లాడు. కోటలో ఉండే సామానంతా బళ్లమీద తన వూరు చేరవేయించాడు.

ఫకీరు, "ఇకనన్నా నా చిలకను నాకిచ్చెయ్యి," అన్నాడు. బాలుడు ఇవ్వనన్నాడు. ఫకీరు ఆత్రంగా బాలవద్దిరాజు చేతిలోంచి చిలకను లాక్కోబోయినాడు. చిలక తల బాలవద్దిరాజు చేతిలో మిగిలిపోయింది. మొండెం ఫకీరు చేతిలోకి వచ్చింది. 'యాఅల్లా, యాఖుదా' అంటూ మాయలఫకీరు ప్రాణాలు విడిచాడు.

బాలవద్దిరాజు బళ్ళకెక్కించిన సామానులు తిరిగి తెప్పించి, ఫకీర్లను పిలిపించి అన్నదానాలు చేసి, ఒక పెద్ద తోట వేయించి అందులో ఫకీరుకు గోరీ కట్టించి, గోరీదగ్గిర పెద్ద కొట్టు కట్టించి, అందులో ఫకీరు ఆస్తి అంతా ఉంచాడు. ఫకీరుపేర నిత్యమూ సాంబ్రాణి వేయటానికి ముప్పైమంది ఫకీర్లను పెట్టి ఆ ఆస్తి వారిని అనుభవించమన్నాడు.

బాలుడు ఇంటికి వచ్చి అత్తవారిచ్చిన ఆరు రాజ్యాలూ ఏలుతూ తల్లులతోనూ తండ్రులతోనూ సుఖంగా జీవించాడు.

(అయిపోయింది)






అనగనగనగా ఒక వర్తకుడు. అతనికి రత్నాకరుడు అనే ఒక కొడుకు. ఆ వర్తకునికి రెండు పెద్ద ఓడలున్నాయి. వాటితో వర్తకం చేసి, అతను లక్షలు గడించాడు.

ఒకప్పుడు, కోస్తాకు పోయిన ఓడలు తిరిగి రాలేదు ఏమాఅని వర్తకుడు ఆత్రంతో ఎదురుచూస్తూవుండగా, అవి సముద్రంలో మునిగిపోయినట్టు వార్త వచ్చింది. ఈవార్త వినగానే అతను విచారంతో కుంగిపోయాడు.

ఇంతలో ఒక మరుగుజ్జువాడు అక్కడికి వచ్చి, వర్తకునివేపు వికటంగా నవ్వుతూ "ఏమయ్యా వర్తకుడా! ఎందుకలా విచారిస్తావు? పోయినదానికి విచారిస్తేమాత్రం లాభమేమున్నది? ఐనా నేనొక ఉపాయం చెబుతాను, విను: ఇప్పుడు నీవు ఇంటికి వెళ్లగానే మొట్టమొదట నీకు ఏది కంటబడుతుందో దానిని నాకు ఇచ్చినట్టయితే, నీ ఐశ్వర్యం తిరిగి నీకు లభిస్తుంది. అదీ నాకిప్పుడే ఇవ్వనక్కరలేదు. పన్నెండేండ్లలోగా ఎప్పుడిచ్చినా సరే" అన్నాడు.

ఇది విని, వర్తకునికి ఒక యుక్తి తోచింది. 'ఇంటికి పోగానే ముందు కుక్క గదా ఎదురు రాబోయేది! మరుగుజ్జువానికి కుక్కని ఇచ్చేస్తే తీరిపోతుంది' అనుకొని మరుగుజ్జుతో 'సరే' నన్నాడు. వర్తకుడు 'సరే' అనగానే మరుగుజ్జు మాయమయిపోయాడు.

తీరా వర్తకుడు ఇంటికి చేరుకుని, గుమ్మంలో అడుగుపెట్టేసరికల్లా, అతను అనుకొన్నట్టు కుక్క ఎదురురాలేదు సరికదా, తన ముద్దుల కొడుకు రత్నాకరుడే ముందుగా కంటపడ్డాడు. ఇప్పుడు చేసేదేముంది? వాగ్దానం ప్రకారం మరుగుజ్జువానికి తన కుమారుడినే ఇచ్చివేయాలె. "సరే, పన్నెండేళ్లవరకూ గడువున్నదికదా,

ఏ. నరసింహమూర్తి, చినగంజాం



అప్పటిమాట చూచుకొనవచ్చు" అని అనుకొని, వర్తకుడు చల్లగా ఊరుకున్నాడు.

ఒకరోజున అతను పొలము దున్నుతూవుండగా నాగలికొర్రుకు ఏదో బండ తగిలింది. అక్కడ కొంచెంలోతుగా తవ్వేసరికి, ఒకబిందెనిండా బంగారు నాణెములు కనపడినయి. ఈవిధంగా నిధి దొరకటం మరుగుజ్జువాని మహిమే అయివుంటుందని వర్తకుడు తెలుసుకొన్నాడు. అప్పటినించీ అతను మళ్లీ లక్షాధికారి అయి, ఎప్పటివలె సుఖంగా ఉంటూవున్నాడు.

ఇలా వుండగా రత్నాకరుడికి పన్నెండేళ్ళూ నిండాయి. మరుగుజ్జువానికిచ్చిన వాగ్దానం చెల్లించవలసినరోజు వచ్చేసింది. ఈ వాగ్దానంగురించి వర్తకుడు చెప్పలేక చెప్పలేక తప్పనిసరిగా కొడుకుతో జరిగిన కథఅంతా చెప్పాడు.

దానికి రత్నాకరుడు "ఏడిశాడులే. మరుగుజ్జువెధవ, మనలనేం చేయగలడు? రానీ. వాడి పని చెబుతా" నంటూ. ఒక గిరి గీసి ఆ గిరిలోపల తను కూర్చొని తనతోపాటు తండ్రిని కూడా కూర్చోబెట్టుకొన్నాడు.

కొంచెంసేపటిలో మరుగుజ్జువాడు వచ్చి 'ఓయి వర్తకుడా! దైవసాక్షిగా చేసిన వాగ్దానం నెరవేరుస్తావా?' అని అడిగాడు. 'చూడబోతే వామనమూర్తిలాగ నలుసంత ఉన్నాడు. రెండు తగలనిస్తే వాడేపోతాడు, వీడి బతుక్కి వాగ్దానమొకటా?' అని అనుకొంటూ రత్నాకరుడు వానిపైన కలియబడ్డాడు.

పోట్లాటలో చివరకు రత్నాకరుడే చిత్తు అయిపోయాడు. కనుక శిక్షగా, వానిని ఒక ఓటిపడవలో ఎక్కించి, నీటిలో వదిలేశాడు మరుగుజ్జువాడు. రత్నాకరుడు ఏటిలో కొట్టుకుపోయి, ఒక ఒడ్డుకు చేరుకున్నాడు. ఆఒడ్డున నడుస్తూ పోగాపోగా,

రాక్షసులు నివసించే ఒక బంగారు కొండ, దానిపైన బంగారపు కోట కనిపించాయి.

రత్నాకరుడు ఆ కోట ప్రవేశించి, గదులన్నీ ఒక్కొక్కటే గాలించాడు. చివరి గదికి వచ్చేసరికి, ఒక నాగుపాము కనపడింది. ఆ నాగుపాము అతనితో "నన్ను చూచి భయపడబోకు. నిజానికి నేనొక దేవకన్యను. రాక్షసులు నన్ను ఎత్తుకువచ్చి ఇలా మార్చివేశారు. మారుప్రశ్న వేయకుండా, నేను చెప్పినట్టు చేశావంటే నాకు శాపవిముక్తి అవుతుంది. శాపం పోగానే మామూలురూపం దాల్చి, నిన్ను బతికించుకుని నీకు పాదదాసినై ఋణం తీర్చుకుంటాను" అన్నది.

అందుకు రత్నాకరుడు అంగీకరించగానే ఆమె "ఓయి రత్నాకరుడా! అర్ధరాత్రి వేళ, భయంకరులైన నల్లటి మరుగుజ్జువాళ్లు నిన్ను వెతుక్కుంటూ వచ్చి, 'ఇక్కడెందుకున్నావు?' అంటారు. 'నా దేవకన్య కోసం నేను వచ్చా' నని ధైర్యంతో చెప్పు. 'మరయితే, ప్రాణానికి ప్రాణం ఇస్తావా?' అని అడుగుతారు. 'అలాగే' అనిచెప్పి, నిబ్బరంగా ఉంటివంటే వాళ్లు నీ ప్రాణం తీసుకుంటారు. అంతటితో వాళ్ళ మంత్ర



బలిమి పోయి, నాకు అసలురూపం వచ్చేస్తుంది" అని చెప్పింది.

ఆ రాత్రి ఆమె చెప్పినట్టే జరిగింది. దేవకన్యకు శాపం వదిలిపోగానే, మంత్రజలం చల్లి రత్నాకరుణ్ణి బతికించుకుంది. అంతటినించీ వాళ్ళకు మరుగుజ్జువాళ్ళ పీడ వదిలిపోయింది.

రత్నాకరుడు దేవకన్యను పెళ్ళాడి, బంగారపు కొండపయిన ఆ బంగారు కోటలోనే హాయిగా ఉంటూవుండగా, వారికి ఒక చక్కటి కుమారుడు పుట్టాడు.

కొంతకాలానికి రత్నాకరుడు దేవకన్యతో "నేను ఒకసారిపోయి నా తలిదండ్రులను




చూచి వస్తాను" అన్నాడు. అందుకు ఆమె ఒప్పుకోలేదు. ఎంతచెప్పినా ఆతను వినక పోయేసరికి, 'సరే, నేనేంచేసేది. పోయిరా. ఇదుగో ఈ ఉంగరం వేలికి పెట్టుకుని, ఏమి కోరుకుంటే అది నెరవేరుతుంది. కాని, మీ తండ్రి ఎదుటమాత్రం ఎన్నడూ తలవవద్దు సుమా. ఈ మాట జ్ఞాపకం ఉంచుకో' అని చెబుతూ, భర్తవేలికి మాంత్రిక ఉంగరం పెట్టింది.

ఆమట్టున రత్నాకరుడు తండ్రివద్దకు పోవాలని కోరుకున్నాడు. కళ్లుమూసి తెరిచే లోపల అతను తన తండ్రి ఎదుటనే నిలబడి ఉన్నాడు!

అయితే అతను ఇల్లువదిలిపోయి చాలా కాలం కావటంచేత, తలిదండ్రులు గుర్తు పట్టలేకపోయారు. కొన్ని ఆనవాళ్లు చూచిన మీదట అతను తమ కుమారుడే అయి వుంటాడని వారు నిశ్చయించారు.

అయినా, తన తలిదండ్రులే తనను గురించి సంశయపడటం రత్నాకరునికి కష్టమనిపించింది. వారికి నమ్మకం కలగాలనే వుద్దేశంతో తనకు పెళ్లికావడం, పిల్లవాడు పుట్టడం—ఇవన్నీ పూసగుచ్చినట్టు వారితో చెప్పాడు.

ఈ మాటలు వినేవరకు, వారికి ఇదివరకున్న నమ్మకం కాస్తా తొలగిపోయింది. ఇతనివన్నీ బడాయికబుర్లు అనుకొన్నారు. రత్నాకరునికి పౌరుషం రేగి-తన భార్యనూ, కొడుకునూ వారికి రుజువు చూపాలని, వాళ్లను తలచాడు. మరునిమిషంలో వాళ్లు ప్రత్యక్షమయారు. అప్పుడు ఆ వృద్ధులు, కొడుకుచెప్పినదంతా నమ్మి, కోడలినీ మనవడినీ చూచుకు మురిసిపోయారు.

అయితే–తన మాటను భర్త జవదాటినందుకు దేవకన్య ఉగ్రురాలయి, తగిన శాస్తి చేయాలనుకుంది. ఒకనాడు భార్యాభర్తలు ఏటి ఒడ్డుకు షికారు కెళ్లారు.

అలసటచేత రత్నాకరుడికి అక్కడనే నిద్ర పట్టటం కనిపెట్టి, దేవకన్య, అతని వేలి ఉంగరం మెల్లిగా ఊడదీసింది. తరువాత ఒక్క నిమిషంలో కొడుకుతో సహా ఆమె, బంగారుకోట చేరుకుంది.

కొంతసేపటికి రత్నాకరుడు మెలకువ వచ్చి లేచి, జరిగిన మోసం తెలుసుకొన్నాడు. కాని, ఉంగరం లేక, చేసేదేమున్నది?

తిరిగి తిరిగి రత్నాకరుడు మళ్లీ మరొక కొండ వద్దకు వచ్చాడు. ఆ కొండమీద ముగ్గురు రాక్షసులు వారి ఆస్తి పంపకం తెగక పోట్లాడుకొంటున్నారు. అటువంటి సమయంలో రత్నాకరుడు కనపడగానే, వాళ్ళు బతిమలాడి అతనిని తీసుకువెళ్లి, తీర్పు చెప్పమన్నారు.

"అయ్యా! ఇవిగో పావుకోళ్ళు. ఇవి తొడుక్కొని తలచుకున్న చోటికి పోవచ్చు. ఈ ముత్యాలహారం ధరిస్తే, మనస్సులో తలచుకున్న పని నెరవేరుతుంది. మూడవది ఖడ్గం. ఇది ఎవరిని నరికి రమ్మంటే వారిని సంహరిస్తుంది. ఈ మూడు వస్తువులూ మా ముగ్గురిలో ఎవరికి ఏది చెందవలెనో, మధ్యవర్తిగా ఉండి మీరు పంచిపెట్టండి" అని కోరారు.



అప్పుడు రత్నాకరుడు 'సరే బాగానే వుంది. మీరు చెప్పిన మహిమలు ఈ వస్తువులకు ఉన్నవో లేవో నిజం తెలియనిదే తీర్పుచెప్పడ మెల్లాగ? కనుక, ముందు నేను స్వయంగా పరీక్షచేసి చూడాలి' అన్నాడు. వాళ్లు అందుకు వప్పుకున్నారు.

రత్నాకరుడు హారం ధరించి, ఖడ్గం చేత పుచ్చుకొని, పావుకోళ్లు తొడుక్కున్నాడు. తలుచుకున్నంతలో అతను బంగారు కొండపైన బంగారు కోట చేరుకున్నాడు.

అక్కడ అతనికి బాజా భజంత్రీల సందడి వినపడింది. ఇదేమిటా విడ్డూర

మని చూచేవరకు, దేశదేశాలనుంచి స్వయంవరంకోసమని వచ్చిన రాజకుమారులు దర్బారుమందిరంలో విందుకు కూర్చున్నట్టు తెలియవచ్చింది.

రత్నాకరుడు అదృశ్యరూపంలో దేవకన్య పక్కనే చేరి, ఆమె విందు ఆరగించకుండా ఆటంకం కలిగించేసరికి, రాక్షసి మాయలు మళ్లీ తనమీద ప్రయోగమవుతున్నయని కంగారుపడి ఆమె అమట్టునే పడకగదికి పోయి, భయంతో ఏడుస్తూ పడిపోయింది.

అప్పుడు రత్నాకరుడు మామూలు రూపంలో ఆమెకు కనపడి "నామీది ప్రేమచేత నా తండ్రి మరుగుజ్జువానికిచ్చిన వాగ్దానం తప్పిపోయాడు. నన్ను మరచిన నా తలిదండ్రులకు ఆనవాలు చూపించటంకోసం నీ కిచ్చిన వాగ్దానం నేను తప్పిపోయాను. కాని, నా ప్రాణం అడ్డువేసి రాక్షసి మాయలనుంచి నిన్ను తప్పించినప్పుడు చేసిన వాగ్దానం నువు ఎందుకు తప్పిపోయావో బోధపడటం లేదు" అని అన్నాడు.

దేవకన్య తన తప్పిదాన్ని తెలుసుకొని క్షమించమని భర్తను ప్రార్థించింది. ఆ వెంటనే స్వయంవరం ఆగిపోయింది.

అప్పటినించీ రత్నాకరుడూ, దేవకన్యా వారి ముద్దుల కుమారుడూ బంగారుకొండమీద బంగారుకోటలో హాయిగా ఉంటున్నారు.

నోటిమాట గాలికి పోయేదికదా, తప్పిపోతే రాబోయే కష్టమేమిటి అనుకొంటారు, చాలామంది. కాని మానవుని జీవితమంతా మాటమీదనే ఆధారపడివుంది. మాట తప్పిపోవటంవల్ల ఇక్కడ వర్తకునికీ, రత్నాకరునికీ, దేవకన్యకూ కూడా ఎటువంటి ప్రమాదాలు వచ్చాయో, చూడండి.






పూర్వం ఒకప్పుడు చీనా దేశాన్ని 'యంగ్‌లో' అనే చక్రవర్తి పాలిస్తూ ఉండేవాడు. ఆయన పరిపాలనలో 'పెకింగ్' ముఖ్యపట్టణంగా ఉండేది. పెకింగ్‌లో పెద్దపెద్ద భవనా లెన్నో వెలిశాయి. ఈ భవనాలకు తోడు, ఒక అపురూపమయిన గంటస్తంభం కట్టించాలెనని యంగ్‌లో ఉద్దేశం. ఎంత కర్చు అయినా సరే, తన సంకల్పం నెరవేరవలెనని ఆయన నిశ్చయించుకొన్నాడు.

'ఒక గొప్ప స్తంభం కట్టి, అందులో ఒక పెద్ద గంట అమర్చాలి. ఇది ప్రపంచములోని ఇతరదేశాల గంటలన్నిటి కంటె పెద్దదీ, నాణ్యమయినదీ అయి వుండాలి. ఈ గంట మోగిస్తే. ఖంగుమని దాని ధ్వని పట్టణమంతటికీ స్పష్టంగా వినిపించాలి. ఇటువంటి గంట తయారు చేయగల పనివానిని ప్రపంచంలో ఏమూల ఉన్నాసరే, మనకు ఎంత ధనం కర్చు అయినాసరే, రప్పించవలిసింది' అని చక్రవర్తి ఆజ్ఞాపించాడు.

చక్రవర్తి ఆజ్ఞప్రకారం దేశమంతటా చాటింపు వేయించారు. గంట తయారు చేయటానికి 'కువాన్యు' అనే కమ్మరి వచ్చాడు. కువాన్యు చీనాదేశ మంతటికీ పేరొందిన కమ్మరి. అతని పేరుప్రఖ్యాతులు ప్రపంచమంతటా అల్లుకుపోయినయి. ఈపని నెరవేర్చటానికి కువాన్యువంటి నిపుణుడు దొరికినందుకు చక్రవర్తి కూడా ఎంతగానో సంతోషించాడు.

కువాన్యుకు కోరినంత ధనము, అతని కింద పని చేయటానికి కావలసినంత మంది జనము సిద్ధమయింది. తను గడించిన అనుభవాన్నంతటినీ వినియోగించి, అనేక శాస్త్రగ్రంథాలు తిరగవేసి, కువాన్యు రకరకాల లోహాలు మిశ్రమం చేశాడు.

చావలి రామారావు, నర్సాపురం



వాటిని కరిగించి ఇక మూసలో పోస్తాడనగా, చక్రవర్తి పరివారమూ చూడవచ్చారు.

కాని, దురదృష్టంకొద్దీ సలసల కాగుతున్న లోహం పోసీపోయడంతోనే మూస టపీమని బద్దలైపోయింది. ఈ విధంగా కొన్ని సంవత్సరముల కాలమూ, బోలెడంత ధనమూ వ్యర్థమైనందుకు కువాన్యు విచారించాడు.

అయితే, చక్రవర్తి మాత్రం విచారించలేదు. 'సిద్ధహస్తుడైన కువాన్యు యేమిటి, ఈపాటి పని నెరవేర్చలేకపోవడ మేమిటి? ఇది ఏదో పొరపాటు జరిగివుంటుంది కాని, అతని అసమర్థత ఎంతమాత్రము కాదు' అనుకొని, కువాన్యును మళ్లీ ప్రయత్నించమన్నాడు. అతనికి ఏవిషయంలోనూ లోటు రాకుండా, కోరినంత ధనమూ సిబ్బందీ ఎల్లప్పుడూ సిద్ధంగావుండే ఏర్పాట్లు చేయించాడు చక్రవర్తి.

కువాన్యు ధైర్యం తెచ్చుకొని, అనేక సంవత్సరాలపాటు మళ్లీ ప్రయత్నించాడు. ఈసారి మూసలో లోహం పోసేసమయానికి చక్రవర్తీ, పరివారమూ, ఎంతోమంది జనమూ విడ్డూరంగా చూడవచ్చారు. ఇప్పుడు మూస బద్దలైపోలేదు గాని, గంట మాత్రం తూట్లు పడి, ఒక తేనెపట్టులాగ తయారయింది.

ఈసారి కూడా సంవత్సరాలకాలమూ, బోలెడంత ధనమూ వ్యర్థమయేవరకు, చక్రవర్తికి చికాకు కలిగింది. 'ఇంకొక్కసారి ప్రయత్నించటానికి అవకాశమిస్తున్నాము. ఈసారి నెరవేరకపోతే తల కొట్టించి, కోటగుమ్మానికి వేలాడదీయిస్తా' మని కువాన్యును హెచ్చరించారు.

కువాన్యు ఇంటికి పోయి గ్రంథాలన్నీ మళ్లీ ఒకసారి తిరగవేశాడు. కాని, తనకు తెలిసినదానికంటె కొత్తవిషయం ఎక్కడా కనిపించలేదు.

ఈసారయినా తనకు జయం కలిగించు మని ముక్కోటి దేవతలకు మొక్కు కొన్నాడు. పని నెరవేరక పోయినట్టయితే తనకు ఏమిగతి పట్టబోతుందో, తన ప్రియ మైన కుమార్తె 'కోవాయ్'తో చెప్పలేక చెప్పలేక చెప్పాడు.

కోవాయ్ అందాల బరిణె: శీలవతి. తండ్రిపైన ఆమెకు అమితభక్తి. అందు చేత, తండ్రి చెప్పిన మాటలు విన్నవెంటనే కోవాయ్, కొండలలో వుండే సాధువువద్దకు వెళ్లి సంగతి సందర్భాలన్నీ విప్పి చెప్పింది. అప్పుడు సాధువు ఆమెపైన జాలి దలిచి, "అమ్మాయీ! మీ నాయన తయారుచేసే గంటకు లోహపు పాళ్లు అన్నీ సరిగానే వున్నాయి. వాటిలో పొరపాటుగాని లెక్క తప్పుకాని ఏమీ లేదు. అయితే, ఇటువంటి ఘనకార్యం చేసేటప్పుడు బలి ఇవ్వకపోతే పని జరగదు. ఇప్పుడు ఈగంటకు శీలవతి అయిన ఒక కన్యయొక్క రక్తం కలిసి నట్టయితే, మరి ఏ ప్రయత్నమూ అక్కర లేకుండా సరిగా వస్తుందని శాస్త్రాలు చెబు తున్నాయి" అని సలహాచెప్పాడు.

కోవాయ్ ఉత్సాహంతో ఇంటికి వచ్చి, 'నాయనా! నీవు ఎంతమాత్రమూ విచారించ



వలసిన పనిలేదు. ఈసారి ప్రయత్నించు. తప్పకుండా గంట చక్కబడుతుంది. నీకు మాటా మాణిక్యమూ దక్కుతుంది. కీర్తి వస్తుంది నీ ప్రజ్ఞకు రాజు సంతోషిస్తాడు' అని ధైర్యం చెప్పింది.

కోవాయ్ ఇంత ధైర్యంగా ఎలా చెప్ప గలుగుతున్నదో పాపం తండ్రికి ఏమీ తెలి యదు. అమె సాధువువద్దకు వెళ్లటంకాని, ఆయన సలహా పొందటంగాని కువాన్యు ఎరగడు. అయినా కూతురు మాటపైనుండే నమ్మకంచేత ఆమె చెప్పినట్టుగా కువాన్యు మూడవసారి ప్రయత్నించాడు. మళ్లీ కొన్ని సంవత్సరాలపాటు పరిశ్రమచేయగా, పని

అంతా పూర్తి ఐంది. కువాన్యు ఇక లోహం మూసలో పోత పోస్తాడనగా చక్రవర్తితో కూడా ఊరంతా వచ్చి విరగబడ్డారు.

లోహం కరిగించి కువాన్యు మూసలో పోస్తూవుండగా జనంలో పెద్ద గోల బయలు దేరింది. ఏమీ?—"నాన్నా! నాన్నా!!" అంటూ అతని ముద్దులకూతురు కోవాయ్, సలసల కాగే ఆ లోహంలోకి ఉరికి, బలి అయిపోయింది!!—ఇలా ఆమె నిప్పులోకి ఉరకటానికి కారణం ఏమైవుంటుందో ఎవ్వరూ ఊహించలేకపోయారు.

కూతురును రక్షించుకుందామని కువాన్యు శాయశక్తులా యత్నించాడు. కాని,...శరీరమంతా ఆ లోహానికి ఆహుతి అయిపోయి, ఆమె కాలిజోడు మాత్రం అతని చేతిలో చిక్కుకొన్నది.

తరవాత మూస విప్పి చూచారు. అద్భుతమైన గంట, సరిగా చక్రవర్తి మనసులో ఉద్దేశంప్రకారం తయారైంది. చక్రవర్తి అపరిమితంగా సంతోషించాడు. అనుకొన్నప్రకారము బ్రహ్మాండమయిన గంట స్తంభమూ కట్టించాడు. అతని కోరిక అక్షరాలా నెరవేరింది. కాని, గంటకి బలిఅయిన తన కూతురుతోపాటు కువాన్యు జీవితమే నాశనమైపోయింది.

నాటికీ నేటికీకూడా ఆ గంట వాయించినప్పుడల్లా 'షేః! షేః!!' అని పలుకుతుందట. 'షేః' అంటే చీనాభాషలో 'జోడు' అని అర్థం. కనుక బలి ఐపోయిన కోవాయ్ ఆ ధ్వనివల్ల తన జోడు తనకు కావాలని అడుగుతున్నదని ఆ దేశపు ప్రజలు ఈ నాటికికూడా అనుకొంటూ వుంటారు.

శాశ్వతంగా ఉండిపోయే ఇటువంటి గొప్ప పనికోసం కోవాయ్ తన ప్రాణాలనైనా లెక్కచేయక తండ్రి కీర్తిని నిలబెట్టింది! [ఆధారం: ఒక చైనా కథ]






పూర్వం దేవలోకంలో ఒక గంధర్వ రాజుకి కాదంబరిఅనే కూతురు ఉండేది. అమె చాలా అందకత్తె. ఆమెకు 'మహాశ్వేత' ప్రాణ స్నేహితురాలు.

కాదంబరి మహాశ్వేతలు ఎప్పుడూ ఒకరినొకరు విడిచివుండేవారు కారు. తమకు వివాహమయితే ఎక్కడ ఎడబాటు కలుగుతుందో అనే భయంతో వివాహం చేసుకోకూడదని నిశ్చయించుకున్నారు.

కాదంబరి సౌందర్యమూ, మంచి గుణములూ విని, చంద్రుడు ఆమెను ప్రేమించాడు. ఒకనాడు ఏకాంతంలో కాదంబరితో తన మనస్సులో వుద్దేశం వెల్లడించేశాడు. కాదంబరి కాదనలేదు. తనుకూడా చంద్రుణ్ణి ప్రేమించినప్పటికీ, తనూ మహాశ్వేతా చేసుకొన్న ఏర్పాటు జ్ఞాపకంవచ్చి, ఏమీ బదులు చెప్పకుండా ఊరుకుంది.

ఇలాగే మహాశ్వేతకూడా పువ్వులు కోసుకుందామని ఒకమాటు అడవిలోకి వెడితే, అక్కడ పుండరీకుడనే ఋషికుమారుడు ఆమెను చూచి ప్రేమించాడు. ఆ విషయం ఆమెకు చెప్పతూ వుండగా పుండరీకుని స్నేహితుడు, కపింజలుడు అక్కడికి రావటం జరిగింది.

కపింజలుడికి ఆడవాళ్ళంటే కోపం. ఏమంటే, అతను తపోధ్యయనపరాయణుడు. తపస్సు చేసుకొనేవాళ్లకు ఆడవాళ్లు ఆటంకమవుతారనీ, కనుక పెళ్లి పనికి రాదనీ కపింజలుని నమ్మకం. అందుకనే, తను పెళ్ళాడటం మానుకోవడమే గాక పుండరీకుడిచేతకూడా 'పెళ్ళాడను' అని ఒప్పించి మాట పుచ్చుకొన్నాడు.

ఇలాంటిపరిస్థితిలో మహాశ్వేతతోకూడా పుండరీకుడు కపింజలుని కంట బడ్డాడు. ఆడవాళ్లను ద్వేషించే కపింజలుడికి

సొలంకి వెంకటరామచంద్రమూర్తి, మద్రాసు



వెంటనే మంటెత్తుకువచ్చి మహాశ్వేతను శపించబోయాడు. కాని పుండరీకుడు స్నేహితుని కాళ్ళమీదపడి, శపించవద్దని బతిమాలాడు. అప్పుడు కపింజలుడు "ఐతే ఇంకెప్పుడూ నువ్వు ఆ పిల్లమాట తలపెట్టకూడదు. అలా నీవు వొప్పుకుంటే నేను శపించను." అని పుండరీకుణ్ణి తనతో తీసుకుపోయాడు.

ఈ సంగతి కాదంబరి చెవిని పడగానే ఆమెకు కోపంవచ్చింది. ఆమె మహాశ్వేతను పిలిపించి, 'నేను చంద్రుడిమాట మరిచిపోతాను. నువ్వుకూడా పుండరీకుని మాట మరచిపోవాలి' అని శాసించింది.

అక్కడ అడవిలో పుండరీకుడు మహాశ్వేతమాట ఇంక తలపెట్టనని కపింజలునితో అన్నాడేకాని, ఎంత మరిచిపోదామన్నా, అతనికి సాధ్యమయిందికాదు. మహాశ్వేతకోసం పలవరించి, పలవరించి చివరకు బెంగపట్టుకుని, అతను జబ్బుపడ్డాడు ఆ స్థితిలో అతనికి కపింజలునితో తన అవస్థ వెల్లడించక తప్పిందికాదు.

కపింజలుడికి పుండరీకుడంటే ప్రాణం. వానిఅవస్థ చూడగానే, అతనికి మహాశ్వేత మీద ఉన్న ద్వేషమంతాపోయి, ఆమెను పుండరీకుడితో చేర్చడంకోసం దేవలోకానికి బయల్దేరి వెళ్ళేడు. కాని మహాశ్వేతను పంపటానికి కాదంబరి వప్పుకోలేదు. ఎంత బ్రతిమాలినా లాభంలేకపోయింది. అతనికి వళ్ళుమండి, "సరే, మహాశ్వేతకోసం నామిత్రుడు పుండరీకుడు ప్రాణాలు విడిచేస్తాడు. అలాగే నిన్ను ప్రేమించి పెళ్ళిచేసుకుంటానన్న వాడు కూడా నీకోసం ఏడ్చేడ్చి చచ్చిపోతాడు. నువ్వుకూడా వాడికోసం బాధపడి ఏడుస్తావు" అని శపించాడు.

మహాశ్వేత వెంటనే కపింజలుడి కాళ్ళమీద పడి, "అయ్యా, మా స్నేహితురాలిని ఇంత కఠోరంగా శపించావేమిటి? నేను



నీతో పుండరీకునివద్దకు వస్తాను. మాచెల్లికి ఇచ్చిన శాపం తీసివేయి" అని ఏడ్చింది. కపింజలుడికి కోపం తగ్గి, "ఇచ్చిన శాపం తిరగదు. శాపంప్రకారం ఆమె ప్రియుడు చావక తప్పదు. కాని మళ్లీ బ్రతికేటట్లు శాపం మారుస్తానులే" అన్నాడు.

కాదంబరితో చెప్పి మహాశ్వేత కపింజలుడి వెంట పుండరీకుణ్ణి చూడటానికి వెళ్లింది. ఆమెరావటం ఆలస్యమై అప్పటికే పుండరీకుడు ప్రాణాలు విడిచేశాడు. మహాశ్వేత గోలపెట్టి ఏడ్చింది. ఆతనితో సహగమనం చేస్తానంది. తాను అడ్డం రాకపోతే మహాశ్వేతా పుండరీకుడూ పెళ్లిచేసుకుని సుఖంగా ఉండేవారే అనీ, తనమూలాన తన స్నేహితుడేకాకుండా మహాశ్వేతకూడా ప్రాణాలు విడిచెయ్యవలసివస్తోందనీ కపింజలుడు దుఃఖించాడు.

ఈ సంగతి కాదంబరికి తెలిసి, తన మూలానకదా మహాశ్వేత చచ్చిపోతున్నదని దుఃఖించింది. కాదంబరిలో మార్పు గ్రహించి చంద్రుడు మెల్లిగా ఆమె దగ్గర కొచ్చి సంగతి సందర్భాలన్నీ తెలుసుకొన్నాడు. 'మహాశ్వేత లేనిది ఒక్క క్షణంకూడా బతకలే' నన్నది, కాదంబరి.

అప్పుడు చంద్రుడు, 'మహాశ్వేత చచ్చిపోకుండా చేస్తాను. మరి నన్ను పెళ్లిచేసుకుంటావా?' అని అడిగి ఒప్పించి, మహాశ్వేత సహగమనం చెయ్యటానికి సిద్ధంగా ఉన్న చితిమీదనించి పుండరీకుడి శవాన్ని అమాంతంగా పైకి ఎత్తుకుపోయాడు.

పుండరీకుని శవం లేకపోతే ఇంక మహాశ్వేత సహగమనం చెయ్యటానికి వీలుండదుకదా అని చంద్రుని ఉద్దేశం.

కాని కపింజలుడు ఊరుకుంటాడా? చంద్రుణ్ణి అటకాయించి, పుండరీకుడి శవం అక్కడ పెట్టమన్నాడు. చంద్రుడు



పెట్టనన్నాడు. అప్పుడు కపింజలుడు 'మనుషులంటే తేలిగ్గా మాట్టాడేవు గనక నువ్వు కూడా ఒక మనిషివై భూలోకంలో పుట్టు. మా పుండరీకుని మల్లేనే నీ ప్రియురాలి కోసం బాధపడుతూ చచ్చిపో' అని శాపమిచ్చాడు. ఇంతవరకూవచ్చాక చంద్రుడు మాత్రం ఊరుకుంటాడా? 'నన్ను ఇలా శపించావు గనక నీకు తగిన శాస్తి చేస్తున్నా చూడు. నేను భూమిమీద మనిషినై ఉన్నంతకాలం నువ్వు గుఱ్ఱానివై నన్ను మోస్తూవుండు' అని మారుశాప మిచ్చి, పుండరీకుని శవంతో తన లోకంలోకి ఎగిరిపోయాడు.

చంద్రుడికీ కపింజలుడికీ వచ్చిన తగాయిదావల్ల వాళ్ళు ఒకళ్ళనొకళ్ళు శపించుకోవడం జరిగిందే తప్ప మహాశ్వేతకు మాత్రం పుండరీకుని శవం దొరకలేదు. అంచేత ఆవిడకి సహగమనం చెయ్యటానికి వీల్లేకపోయింది. అప్పుడామె పుండరీకుని ప్రతిమ ఒకటి రాతితో తయారు చేయించి, దానికి రోజూ పూజ చేస్తో కాలం గడుపుతున్నది.

కాదంబరిని పెళ్ళిచేసుకోకుండానే కపింజలుడి శాపంవల్ల చంద్రుడు, భూలోకంలో ఓ రాజుకొడుకై పుట్టేడు. అతనికి చంద్రపీడుడని పేరుపెట్టేరు. పుండరీకుడు మహాశ్వేతను పెళ్ళిచేసుకోకుండానే బలవంతంగా చనిపోయాడుగనక అతనుకూడా మళ్ళీ జన్మ ఎత్తేడు. చంద్రపీడుడు పుట్టిన రాజ్యంలోనే, పుండరీకుడు మంత్రి కుమారుడై పుట్టేడు. అతనికి వైశంపాయనుడని పేరు. అక్కడ చంద్రుడు చంద్రపీడుడై పుట్టడంతోనే, అతనిచ్చిన శాపంవల్ల కపింజలుడు ఉన్నట్టుండి, ఒకనాడు గుఱ్ఱంగా మారిపోయాడు. అడవిలో ఉన్నవాళ్ళు ఆ గుఱ్ఱాన్ని చూసి, 'ఇదిచాలా చక్కగా ఉన్నది. దీన్ని యువరాజుగారికి

కానుకగా ఇద్దాం' అని ఆలోచించి, దాన్ని తీసుకెళ్లి చంద్రపిదుడికి సమర్పించారు.

చంద్రపిదునికి మంత్రికొడుకైన వైశంపాయనునికీ ప్రాణ స్నేహం. గుఱ్ఱం రూపంలో ఉన్న కపింజలునికి చంద్రపిదుణ్ణి మొయ్యటం కష్టంగానే ఉండేది గాని, తన స్నేహితుడైన పుండరీకుడు వైశంపాయనుడై పుట్టి చంద్రపిదునివద్ద ఉన్నాడు గనక అతన్ని చూసుకుంటూ తన కష్టాన్ని మరిచిపోయేవాడు.




కొంతకాలమయాక చంద్రపిదుడు ఒకనాడు గుఱ్ఱం ఎక్కి వేటకు వెళ్లేడు. వైశంపాయనుడూ, తక్కిన స్నేహితులూకూడా వెళ్లేరు. కాని హడావిడిలో వాళ్లందరూ దారి తప్పి తలోవైపునకూ చెదరిపోయారు. అడవిలో గుహ ఒకటి కనిపిస్తే, అందులో ఏముంటుందో చూద్దామని ఆ గుఱ్ఱం చంద్రపిదుణ్ణి అందులోకి తీసుకెళ్లింది. ఆ గుహలోంచి వెళ్లగా వెళ్లగా వాళ్లకి దేవలోకం, అక్కడ కాదంబరీ కనపడ్డారు. చంద్రపిదుడు శాపంవల్ల మనిషయి పుట్టిన చంద్రుడే గనక అతనికి పూర్వం ఉన్న రూపం మారలేదు గనుక కాదంబరి అతణ్ణి సులువుగా అనవాలు పట్టింది. చంద్రపిదుడికి మాత్రం కాదంబరి సంగతి జ్ఞాపకం లేదు గాని ఆమె అందాన్ని చూసి అక్కడనే ఉండిపోయాడు.

చంద్రపిదుడు ఏమైపోయాడో అని వైశంపాయనుడు, అడవి అంతటా వెతకగా, అతనికి పుండరీకుడి శిలావిగ్రహాన్ని పూజ చేస్తూవున్న మహాశ్వేత కనపడింది. ఆమెను చూసీ చూడ్డంతోనే వైశంపాయనునికి ఆమెను పెళ్లి చేసుకోవాలని బుద్ధి పుట్టి, ఆమాట ఆమెతో చెప్పాడు.

అతను పూర్వజన్మలో తాను ప్రేమించిన పుండరీకుడే అన్న సంగతి మహాశ్వేతకు



సంగతి వైశంపాయనుడికి తెలియదు. ఆమెను వదిలి పోలేక 'నిన్ను ప్రేమించాను. నన్ను పెళ్లి చేసుకో' అని బ్రతిమాలడం మొదలుపెట్టేడు. మహాశ్వేతకి కోపం వచ్చి, 'దుర్మార్గుడా, పొమ్మంటే పోక పతివ్రతనైన నన్ను ఇలా బాధ పెడుతున్నావు గనక ఓ చిలకవై పోయి కొమ్మ కొమ్మకీ వెళ్లి ఏడుస్తో తిరుగు' అని శపించేసింది. పాపం వైశంపాయనుడు తక్షణమే చిలకగా మారిపోయి 'మహాశ్వేతా, నిన్ను ప్రేమించాను. మహాశ్వేతా నిన్ను ప్రేమించాను' అంటూ అడివి అంతా తిరగటం మొదలెట్టేడు.

తెలియదు. తను పెళ్లి చేసుకుందామనుకున్న పుండరీకుడు చనిపోయాడనీ, తానతనితో సహగమనం చెయ్యటానికి వీల్లేక పోయింది గనక తాను బ్రతికిఉన్నంత కాలమూ పుండరీకుని విగ్రహానికలా పూజ చేస్తో కాలం వెళ్లబుచ్చటమేగాని, మరొకణ్ణి పెళ్లి చేసుకోననీ ఆమె వైశంపాయనునితో తన నిశ్చయాన్ని వెల్లడించింది. ఈ జవాబు చెప్పేటప్పుడు ఆమె తలవంచుకొనే వున్నది గాని పరపురుషుడైన వైశంపాయనుని వైపు క్రీగంటనైనా చూడలేదు.

'నువు పూజిస్తూవున్న ఆ పుండరీకుణ్ణి నేనే మహాశ్వేతా' అని చెప్పటానికి ఆ

అక్కడ దేవలోకంలో—కాదంబరితో ఉన్న చంద్రపిదుడికి ఒకనాడు భూలోకం, అక్కడ తన తలిదండ్రులూ, తన స్నేహితుడైన వైశంపాయనుడూ జ్ఞాపకం వచ్చారు. చంద్రపిదుడు కాదంబరితో చెప్పకుండానే చటుక్కున గుఱ్ఱమెక్కి గుహ వెంబడి అడవిలోకి వచ్చేశాడు. కనపడ్డ వాళ్లనల్లా 'మా వైశంపాయనుణ్ణి చూశారా మీరు?' అని అడుగుతూ వచ్చాడు. రాతివిగ్రహానికి పూజ చేస్తో కనపడిన మహాశ్వేతను కూడా అడిగేడు.

ఆమె "మీ వైశంపాయను డెవరో నాకు తెలియదుగాని, ఎవరో మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చి నన్ను పెళ్లి చేసుకోమని వేపుకుతింటే ఒళ్లు మండి చిలకగా మారి పొమ్మని శపించాను' అని మాత్రం చెప్పింది. "అయ్యో, అతనే మా వైశంపాయనుడు" అంటూ చంద్రపిడుడు ఆ చిలకకోసం అడివంతా వెతకటం మొదలెట్టేడు.

వైశంపాయనుడే పుండరీకుడన్న సంగతి మహాశ్వేతతో వెల్లడి చేయాలని గుఱ్ఱం రూపంలో ఉన్న కపింజలుడికి అనిపించింది. కాని గుఱ్ఱం మాట్లాడదుగా? కనుక చంద్రపిడుణ్ణి మోసుకుంటూ పోయి ఆ చిలకకోసం తానుకూడా వెతకటం మొదలెట్టాడు. కాని లాభంలేక పోయింది.

అక్కడ దేవలోకంలో కాదంబరి చంద్రపిడుడు వెళ్లిపోయాడని బాధపడింది. నేడు వస్తాడు, రేపు వస్తాడని రోజూ ఎదురుచూస్తున్నది. ఇంతలో ఆమెకు కపింజలుడు ఇచ్చిన శాపం జ్ఞాపకానికి వచ్చి చంద్రపిడుడేమయాడో అనుకుంటూ దేవలోకంలోంచి దిగి ఆ అడవులవెంట వెతుక్కుంటూ వచ్చింది. కాని ఆమె



వచ్చి చేరుకునే వేళకి, తనకూ, చంద్రునికీ కపింజలుడు ఇచ్చిన శాపాల ఫలితం కనిపించింది.

వైశంపాయనుణ్ణీ, తలితండ్రుల్నీ ఒకమాటు చూసి మళ్లీ కాదంబరివద్దకు వెళ్లిపోదామని వచ్చిన చంద్రపిడుడు చిలకగా మారిన వైశంపాయనుణ్ణి వెతకటం ప్రారంభించాడు. ఎంత వెతికినా వైశంపాయనుడు కనపడలేదు. తాను ప్రేమించిన కాదంబరినీ, స్నేహితుడైన వైశంపాయనుణ్ణీ తలుచుకుంటూ చంద్రపిడుడు ఒకనాడు మహాశ్వేత ఆశ్రమం చేరుకొని, అక్కడ ప్రాణాలు విడిచేశాడు.

అతని ప్రాణాలు పోయాక కాదంబరి వచ్చి, ఆ శవాన్ని చూసి గోలపెట్టి ఏడ్చింది. సహగమనం చేస్తానని భీష్మించిన మహాశ్వేతకుమల్లేనే ఇప్పుడు కాదంబరికూడా సిద్ధపడింది.

ఇంతలో అక్కడే తిరుగుతూవున్న గుఱ్ఱం, చంద్రపీడుడు చనిపోయాడు గనక, చంద్రుడిచ్చిన శాపం తీరిపోయి, కపింజలుడుగా మారింది.

ఏడుస్తోన్న కాదంబరిని కపింజలుడు చూసి జాలిపడి 'కాదంబరీ, దుఃఖించకు. చంద్రపీడుడు మళ్లీ బతుకుతాడని చెప్పేనుకదా' అన్నాడు. అలా అంటూండగానే చంద్రపీడుడికి ప్రాణాలు వచ్చి, లేచి కూచున్నాడు.

కాదంబరి సంతోషించింది కాని, తన మూలాన్ని మహాశ్వేత తను ప్రేమించిన పుండరీకుణ్ణి పెళ్లిచేసుకోలేక పోయింది కదా అని మాత్రం చాలా విచారించింది. అప్పుడు కపింజలుడు 'మహాశ్వేతా, నువ్వు చిలుకగా మార్చివేసిన వైశంపాయనుడే మా పుండరీకుడుసుమా. ఆ చిలుక కనిపిస్తే ఎంత బాగుండును?' అని స్నేహితుని కోసం బాధపడుతూ అన్నాడు. అప్పుడక్కడికి బోయది ఒకర్తె చిలుకనొకదాన్ని తెచ్చి మహాశ్వేతకిచ్చింది. ఆ చిలుక మహాశ్వేతని చూడ్డంతోనే 'మహాశ్వేతా, నిన్ను ప్రేమించాను' అంది. చంద్రపీడుడు ఆనందంతో పరుగెత్తుకు వెళ్లి 'ఇతనే మా వైశంపాయను' డంటూ ఆ చిలుక వంటిని నిమిరేటప్పటికి ఆ చిలక వైశంపాయనుడుగా మారిపోయింది!

కపింజలుడికి అప్పుడు ఆడవాళ్ళంటే ఉండిన కోపం పోయింది. తన కోపం మూలాన్నే వాళ్ళందరికీ ఇన్ని బాధలొచ్చాయనిచెప్పి, చాలా పశ్చాత్తాపపడ్డాడు.






ఒక గ్రామంలో గంగులు, గవరమ్మ అనే పేద దంపతులు ఉండేవారు. వారికి చాలా కాలానికి, ఒక కూతురుపుట్టింది. ఆ పిల్లకు 'గగనమ్మ' అని పేరుపెట్టి, అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారు.

గవరమ్మ ఎంతకాలంనించో కష్టపడి దాచుకున్న డబ్బుతో ఒక నవరసుకొన్నది. దానిని భర్తకు ఇచ్చి. 'కంసాలి బ్రహ్మన్న చేత దీనితో మన గగనకు మురుగులు చేయించండి' అని చెప్పి పంపింది. బ్రహ్మన్న వద్దకు వెళదామని గంగులు బయలుదేరాడు.

ఆ వూరిలోనే బుల్‌బాపిరాజుగారనే జమీందారు ఉన్నాడు. ఆయన భార్య బసవమ్మ జాలిగుండె కలది. బీదలంటే ఆమె ప్రాణం పెడుతుంది.

కంసాలి బ్రహన్న ఇంటికి వెళ్ళాలంటే బాపిరాజుగారి గుమ్మంముందునించే వెళ్లాలి. గంగులు ఆదారిని పోతూవుండగా బాపిరాజుగారు అతన్ని పలకరించి లోపలకు తీసుకుపోయారు. సావిట్లో తాటాకు చాపమీద గంగులును కూర్చోబెట్టి రాజుగారు మాటాడుతూండగా, ఏడుస్తూవున్న మూడేళ్ల అమ్మాయిని తీసుకువచ్చి బసవమ్మ అక్కడ దిగబెట్టింది.

ఆ పిల్ల చేతులకున్న బంగారు మురుగులు చూచి, గంగులు 'మన గగనకు కూడా ఇటువంటి మురుగులేకదా చేయించబోతున్నాము' అనుకొని, మురిసిపోయాడు.

ఇంతలో బసవమ్మ లోపలినించి గబగబ వచ్చి, పిల్ల ఆడుకొంటూవున్న స్థలమంతా వెతికింది. "ఎందు కలా వెతుకుతున్నా?" వని భర్త అడిగేవరకు "అమ్మాయి ఏడుస్తూవుంటే నారాయణమ్మగారు రెండు కాసులు చేతికిచ్చి ఊరుకోబెట్టింది. ఇప్పుడు వెతికితే ఒక్కటే కనపడుతున్నది" అని చెప్పింది.

అమరారపు వీణాంబ, విజయవాడ



సంటే తీరిపోతుందనుకున్నాడు. తన కాసు ఒక్కటీ వారికి ఇచ్చివేస్తే. మరి అతని ముద్దుల కూతురు గగనకు మురుగులు ఎలా వస్తయి? ఇంతకూ, ఇంటికిపోయి భార్యకు ఏమని సమాధానం చెప్పటం?

ఈ విధంగా గంగులు, మనస్సులో మథనపడి, తనవద్దనుండే కాసుతీసి రాజుగారికి ఇచ్చివేసి, ఉసూరుమంటూ తన మానాన తను పోయాడు.

* * *

ఈ మాట వినగానే రాజుగారు "ఏమి గంగులూ! నువుగాని తీయలేదుకద?" అని అడిగారు. ఇప్పుడు గంగులు సంగతి చిక్కులో పడింది. ఇక్కడ రాజుగారి ఇంట్లో కాసు కనపడకుండా పోయింది. తను పేదవాడు కావటంచేత, ఆ సమయంలో అక్కడనే ఉండటంచేత, తనను వారు అనుమానించటంలో ఆశ్చర్యంలేదు. పైగా, తనవద్ద సరీగా ఒకే ఒక కాసు ప్రత్యక్షంగా ఉండనే ఉన్నది. కనుక, అతను ఏమి చెప్పకొందా మనుకొన్నా లోకం నమ్మదు. అందుచేత, తన వద్ద ఉన్న కాసు వారికిచ్చివేసి, 'నేనే తీశా?'

గవరమ్మ అస్తమానం 'ఏమండీ! ఇంకా ఎప్పుడిస్తాడు మన అమ్మాయి మురుగులు?' అని భర్తను పోరుతూవుండేది.

'ఇదుగో అదుగో' అంటూ గంగులు కాలయాపన చేస్తూ వచ్చాడు. ఇంతలో ఒకనాడు కంసాలి బ్రహ్మన్న ఏదో పనిమీద, ఆ వీథిని పోతూ, గవరమ్మ కంట పడేసరికి, ఆమె బ్రహ్మన్నను పిలిచి అడిగింది.

ఆమె మాటలకు బ్రహ్మన్న నిర్ఘాంత పోయాడు. తరువాత నిజానిజాలు బయట పడ్డాయి. భర్త ఇంటికి వచ్చిన తరువాత 'ఏమిటీ మోసం?' అని గవరమ్మ కంగారు పడుతూ అడిగింది. అనాడు బాపిరాజుగారి



ఇంట జరిగినదంతా గంగులు దాపరికం లేకుండా చెప్పేవరకు, ఆమె మొదలు నరికిన చెట్టులా కూలిపోయింది.

*   *   *

ఒకరోజున బాపిరాజుగారి భార్య బసవమ్మ వడ్లు ఎండబోసింది. సాయంత్రం ధాన్యం ఎండినతరువాత వాటిని బస్తాలకు ఎత్తి, చాపలు దులుపుతూవుండగా, ఒక తాటాకు చాపలోనించి బంగారపు కాసు ఒకటి కింద రాలింది.

బసవమ్మ ఆశ్చర్యంతో గబగబ ఇంట్లోకి పోయి, తన వద్దనున్న కాసులు లెక్క చూచింది. "నా పెట్టెలో ఉండవలసిన పధ్నాలుగు నవరసులూ సరీగానే ఉన్నవి. ఆరోజున గంగులు దొంగిలించిన కాసు వెంటనే తిరిగి ఇచ్చివేశాడు కదా. మరి, అదనంగా ఇప్పుడు ఈ కాసు ఎక్కడినించి వచ్చిందీ?" అని ఆమెకు సంశయం కలిగింది.

ఆమె తన సంశయాన్ని భర్తకు చెప్ప గానే, అయన ఆ కాసులన్నీ తీసుకురమ్మ న్నాడు. పధ్నాలుగు కాసులూ పరీక్షించగా అందులో పదమూడు కాసులు 1830 లో తయారయినట్టూ, ఒక్కటిమాత్రం 1843 సంవత్సరంలో తయారైనట్టూ వాటి మీదనుండే ముద్రలు చెప్పాయి.

అప్పుడు రాజుగారు "మన పధ్నాలుగు కాసులూ ఒక్కసారిగా కొన్నవే. కనుక వాటన్నిటిపయినా ఒకే సంవత్సరం వేసి ఉండాలి. ఇందులో పదమూడుకాసులు మనవే, కాని 1843 సంవత్సరం ముద్ర వేసింది మాత్రం మనది కాదు" అని నిశ్చయించారు.

'అయితే, ఈ కాసు గంగులిదే అయి వుండాలి' అని బసవమ్మ అన్నది. వెంటనే గంగులుకి కబురంపి పిలిపించారు. కాసునుగురించి మళ్లీ వారు అడిగేవరకు

గంగులు హడలిపోయాడు. 'నీకొచ్చిన భయం ఏమీలేదు, గంగులూ! నిజంచెప్పు' అని బసవమ్మగారు నెమ్మదిగా అడిగిన మీదట, కళ్ల నీళ్లు గుక్కుకుంటూ గంగులు జరిగిన కథ అంతా చెప్పాడు.

అదంతా విని, 'అయ్యయ్యో, ఎంతపని జరిగింది! గంగగోవువంటి గంగులు మనస్సు ఎరక్కపోయి కష్టపెట్టామే. నిరపరాధిని నిష్కారణంగా వీధికి ఈడ్చాము' అని బసవమ్మగారు అనేక విధాల విచారించింది. గంగులు ఇంటికి వెళ్లిపోయాడు.

* * *

ఇలా వుండగా, మరో వారం రోజులకల్లా పెళ్లామునూ, బిడ్డనీ వెంటబెట్టుకు రమ్మన్నారని చెప్పి గంగులుకు బులిబాపిరాజుగారివద్దనించి మళ్లీ కబురువచ్చింది. రాజుగారి కబురంటే 'గొప్ప దొరలతో పని, ఏమిమాట వచ్చిపోతుందో'నని గంగులు భయపడుతూనే వుంటాడు. ఏమయితే మటుకి తప్పుతుందా రాజుగారి ఆజ్ఞ?

కుటుంబాన్ని వెంటబెట్టుకుని గంగులు రాజుగారి దర్శనానికి వెళ్ళాడు. అప్పటికి కంసాలి బ్రహ్మన్న అక్కడే కూర్చుని వున్నాడు. గంగులు రాగానే బ్రహ్మన్న ఒక చిన్న మూట విప్పి, అందులో వస్తువులు బసవమ్మగారికి అందించాడు. ఆమె ఒకొక్క వస్తువే అంది పుచ్చుకుని, చేతికి మురుగులు, కాళ్లగొలుసులు, మెడలో ముత్యాల హారమూ, వేలికి ఉంగరమూ, స్వయంగా గగనకు తొడిగి, అలంకరించింది.

ఇవన్నీ వంటికి పెట్టగానే గగనమ్మ ముచ్చటగా గంతులు వేయటం ప్రారంభించింది. చిన్నారి గగనమ్మ చిట్టిగంతులు చూచి ఆమె తలిదండ్రులూ, రాజుగారి కుటుంబమేగాక అక్కడ వున్నవారు అందరూ ఎంతో సంతోషించారు.



# చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

## ఆధారములు

### అడ్డము:

1. గాంధీ మహాత్ముడు మత—
3. మార్గము
5. ఎప్పుడూ "ఇవి" తినవద్దు!
8. సింహము వసించు చోటు
10. ఋషి
11. చక్రవర్తి కూర్చుండునది
12. కాలువ
13. అలంకారము
15. మూషికము
17. అసత్యము
18. నక్షత్రము



### నిలువు:

2. బాధ్యత
3. గంతులు
4. సర్పము
6. కాకులు
7. భయము
9. సింహము (అక్షరాల మార్పు)
10. ఒక నది
12. ఒక దిక్కు
14. పశువులు మేయును
15. సరిహద్దు
16. ఏనుగు

## ముగ్గులు



బి. వత్సల, అదవాని



కె. ఆర్. వసంతకుమారి, కళ్ళికోట




# పిల్లల పెంపకం

## చిరునవ్వు

ఆరోగ్యంగా ఉండటానికి చిరునవ్వు ఒక ముఖ్య సాధనం. పిల్లలయినా పెద్ద లయినా ఎల్లప్పుడూ నవ్వుముఖంతో ఉండాలి గాని, ఈదురోమంటూ చిరచిరలాడుతూ ఉండకూడదు. చిరచిరలాడేవాళ్ళను చూస్తే ఎవరికీ చేరదీయ బుద్ధిపుట్టదు. మంద హాసంతో ఉండేవాళ్ళను పిలిచి మాటాడటానికి మనసు కలుగుతుంది.

చిరునవ్వుతో ఉంటే కష్టాలు మరిచిపోతాము. చింత లేని పక్షమందు ఆరోగ్యంగా వుంటుంది. కలకలలాడే ముఖంతో ఉన్నవానిని ఎవరైనా పలకరించి, ఆదరిస్తారు. అతని పనులన్నీ దిగ్విజయంగా నెరవేరుతయి. కనుక, నవ్వుమొగముతో ఉండటం అలవాటు చేసికొనటం మంచిది. మనసుకి సంతోషంగా ఉన్నప్పుడు మామూలుకంటె రెండుమూడు రెట్లు ఎక్కువ పనికూడ చేయగలుగుతాము.

మనస్ఫూర్తిగా నవ్వటంవల్ల మనస్సుకీ శరీరానికీకూడా బలం కలుగుతుంది. అందువల్లనే "సంతోషం సగం బలము" అన్నారు పెద్దలు. దానివలన ఆయుస్సు వృద్ధిఅవుతుంది. నవ్వు జీర్ణశక్తిని హెచ్చుచేసి, రుచిగల పదార్థాలను మరింత రుచికరంగా ఉండేట్టు చేస్తుంది. నిజానికి ఒక్కమాటలో చెప్పాలెనంటే, నవ్వుతూ సంతోషంగా ఉండటం వేయి ఔషధాల పెట్టు.

కనుక, ఆనందంగా ఉండటానికి అవసరమైన చిరునవ్వును, సంగీతం సాధకం చేసినట్టుగానే మనం అలవాటు చేసికోవాలి. యంత్రానికి చమురు ఎలాంటిదో, శరీరానికి నవ్వు అటువంటిదన్నమాట.

మీ పెద్దమ్మ




పైన ఉన్న తొమ్మిది బొమ్మలూ, అన్నీ ఒకేమాదిరిగా కనిపిస్తున్నా, నిజానికి అలా లేవు. తొమ్మిదింటిలో రెండు మాత్రమే ఒక్క మాదిరిగా వున్నై. ఆ రెండూ ఏవో కనుక్కోండి. మీరు కనుక్కో లేకపోతే జవాబుకి 55-వ పేజీ చూడండి.




## పేకముక్కను మాయంచేయుట

ప్రారంభకులకు ఈ ట్రిక్కు చాలా తెలివి స్తుంది. అనేకసార్లు దీనిని నేను దిగ్విజయంగా చేశాను. ఒక పేకబొత్తి సభవారికి చూపించి, కలిపివేయాలి. అందులోనించి ఒకరిని. ఇష్టమొచ్చిన ఒక ముక్కను తీసుకోమను. దానిని నీకు చూపకుండా, నీ చేతిలో ఉండే జేబురుమాలులోపల పెట్టమను. నీ అసిస్టెంటు ఒక గ్లాసూ నీళ్ళూ తీసుకవస్తాడు. సరీగా బొమ్మలో చూపిన రీతిగా గ్లాసు పట్టుకొని, ఆ ఎంచుకొనబడిన ముక్కను గ్లాసులోకి వదులుతావు. తరువాత, జేబురుమాలు దులిపివేసినట్టయితే, ఆ ముక్క గ్లాసులో మాయమైపోతుంది. ఎంత జాగ్రత్తగా కనిపెట్టినా, ఆముక్క ఏమైందో ఎవ్వరూ తెలుసుకోలేరు.



ఇది ఎలా అంటే — సెల్యూలాయిడ్‌తో తయారైన ఒక 'ఫేక్' (తెల్లటి) కార్డు నీ కోటు చేతి మడతలో దాచి ఉంచుకోవాలి. సభలో ఎంచుకోబడిన ముక్క జేబు రుమాలులోనించి గ్లాసులో పడవేయాలికదా! ఆ ముక్కను యుక్తిగాను, చాకచక్యంతోనూ కోటు చేతి మడతలోకి తోసివేసి, దానికిబదులు ఈ 'ఫేక్' కార్డు



గ్లాసులోకి పడేలాగ చూడాలి. ఈ విధానం రెండవ పటములో స్పష్టంగా కనపర్చబడింది. అనగా ఇప్పుడు నీవు నీళ్లలో పడవేస్తున్నది 'ఫేక్' కార్డే కాని, సభవారు ఎంచుకొన్నది కాదన్నమాట. నీవద్ద సెల్యులాయిడ్ 'ఫేక్' కార్డు ఉన్న సంగతి సభవారికి తెలియదుగా? కనుక, వారు ఎంచుకున్న ముక్క గ్లాసులో పడిందని వారు అనుకొంటారు. ఫేక్ కార్డుపైన ఏమీ ఆనవాలు లేక, సాఫుగా ఉండటం చేత, అది నీళ్ళలో పడినప్పుడు నీటితో కలిసి నిర్మలంగానే ఉంటుంది.

ప్రదర్శనం అయిపోగానే ఇంద్రజాలికుడు 'ఫేక్'కార్డును తీసివేయటం మరవకూడదు. ఈ ట్రిక్కు చేసినవెంటనే సభవారు మెచ్చుకొని జేజేలు కొట్టుతూ వుండగా, ఆ ఆనందంలో ఈ ఫేక్ కార్డు తీయటం మరచిపోవటం నా అనుభవంలో జరిగింది. అది నీటితో కలిసిపోయి, కంటికి స్ఫుటంగా కనపడకపోయేవరకు, మన దృష్టిని చప్పున ఆకర్షించదు కనుక, దీని సంగతే సహజంగా మరచిపోతాము.

డక్కాపట్టణంలో ఒకప్పుడు ఇలాగే జరిగింది. ట్రిక్కు చేశాక ఫేక్ కార్డు తీయటం మరిచిపోయాను. ప్రదర్శనం



జరిగిన ఒక గంట తరువాత ఇంట్లో పనివాడు గ్లాసు కడుగుతూ, "ఇదుగో బాబూ, ఇదేదో గళాసులో దొరికిందండి!" అంటూ పట్టుకువచ్చి ఇచ్చాడు. ఇంకేముంది?— నా బండారం కాస్త బయల్పడిపోయింది!

* * *

[ఈ గారడీ ట్రిక్కులనుగురించి మీ అభిప్రాయాలు, మీకుగల సందేహాలూ సరాసరి సర్కారుగారికే వ్రాస్తే, వారు మీకు జవాబిస్తారు. వారికి ఉత్తరాలు ఇంగ్లీషులోనే రాయాలి. ఈమాట జ్ఞాపకం ఉంచుకోండి. వారి అడ్రెసు:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మేజిషియన్,
పోస్టుబాక్సు 7878, కలకత్తా—12.]

అబ్బాయిలూ! అమ్మాయిలూ!

మీరు క్రిందటిసారి వాక్యాల్లో మొదటి పాఠం వరకూ వచ్చారు.
ఈసారి ఈ క్రింది పాఠం చదువుకోండి.

वह राम है।
राम अच्छा लड़का है।
वह क्या करता है?
वह पढता है।
वह क्या पढता है?
वह किताब पढता है।
वह किताब में एक सबक पढता है।

वह रमणी है।
वह राम की बहन है।
वह क्या करती है?
वह लिखती है।
वह क्या लिखती है?
वह चिट्ठी लिखती है।
वह कमला को एक चिट्ठी लिखती है।

राम और रमणी रोज़ स्कूल जाते हैं।
वे रोज़ दस बजे स्कूल जाते हैं।
वहाँ खूब पढ़ते हैं।
पाँच बजे स्कूल से घर आते हैं और खूब खेलते हैं।

अच्छा, अच्छी = మంచి
करना = చేయుట
पढना = చదువుట
किताब = పుస్తకము
सबक = పాఠము
लिखना = వ్రాయుట
चिट्ठी = ఉత్తరము
और = మరియు
रोज़ = రోజూ

जाना = వెళ్ళుట
हैं = ఉన్నారు, ఉన్నవి
वे = వారు
दस = పది
बज़े = గంటలకు, గంటకు
वहाँ = అక్కడ
खूब = బాగుగా
पाँच = ఐదు
आना = వచ్చుట

से = నుండి, నుంచి, వలన, పట్టి, కంటె

ఒక్క సంగతి గుర్తు పెట్టుకోండి: ఏకవచన పుల్లింగమైతే క్రియాపదానికి ता है అనీ, స్త్రీలింగమైతే ती है అనీ, బహువచన పుల్లింగమైతే ते हैं అనీ, స్త్రీలింగమైతే ती हैं అనీ చేరాలి.



ఆ కనపడే ట్రాంబండి ఎక్కాలని పిల్లవాడు తికమకపడుతున్నాడు. దానిని అందుకొని అందులో వెళితేగాని, బడికి టైములోపల చేరుకోలేడు. ఏదారిన వెడితే త్వరగా ఆ ట్రామును అందుకోగలడో కనుక్కోండి.

పజిలుకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ■ | 1 బా | 2 పూ | ■ | 3 దా | రి | ■ |
| 4 నా | ■ | 5 చీ | 6 వా | ట్లు | ■ | 7 భీ |
| 8 గు | 9 హ | ■ | య | ■ | 10 య | తి |
| ■ | 11 సిం | హా | స | న | ము | ■ |
| 12 తూ | ము | ■ | ము | ■ | 13 న | 14 గ |
| ర్పు | ■ | 15 ఎ | లు | 16 క | ■ | ద్ది |
| ■ | 17 క | ల్ల | ■ | 18 రి | క్షా | ■ |

51-వ పేజీలోని చిక్కుబొమ్మలకి జవాబు:

★

1, 7 నెంబర్లు గల బొమ్మలు రెండూ ఒక్కమాదిరివి.

★



ఈనెల ఈ జిరాఫీ బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులు వేసిన బొమ్మని వచ్చేనెల (అక్టోబరు) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor: SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press, Madras 1



Chandamama, September '49 — Photo by B. Ranganadhām

జలకాలు

